Latter : రెండవదైన; వెనుకటిదైన; పరమైన
Posterior : అపరమైన; తరువాతిదైన; పిమ్మటిదైన
Subsequent : తరువాతిదైన; దరిమిలాదైన; అనంతరపుదైన
Succeeding : వెనుకటిదైన; తరువాతిదైన; పిమ్మటిదైన

**PRICE : వెల; ధర; కిమ్మత్తు**

*Synonyms* సమానార్థకములు

Charge : మజూరి; వెల; ఖర్చు; వ్యయము
Cost : వెల; మూల్యము; క్రయము
Expenditure : వ్యయము; వినియోగము
Expense : వెచ్చము; తగులుబడి
Outgo : వ్యయము; వెచ్చము
Outlay : పెట్టుబడి
Value : విలువ; వెల; మూల్యము; కిమ్మతు; యోగ్యత
Worth : విలువ; యోగ్యత

**PRIDE : అదటు; గర్వము; ఆడంబరము; పొగరు; గర్వస్థానము**

*Synonyms* సమానార్థకములు

Arrogance : దురహంకారము; గర్వము; లేనిగొప్ప వహించుట
Assumption : ఊహ; పూనిక; ధారణము
Conceit : అహంభావము; అడిబీరము; ఎగసిపాటు
Disdain : తిరస్కారము; అలక్ష్యము; ఉపేక్ష; గర్హణము
Haughtiness : అహంకారము; గర్వము; ఉద్ధతి; పొగరుబోతు తనము
Insolence : అవినయము; ఔద్ధత్యము; మిట్టిపాటు; ప్రల్లదము

Ostentation : దంభము; డాబు; బడాయి
Presumption : ఊహ, పొగరు; దురభిమానము; అదటు
Reserve : గరసు; అరమరిక; మర్మము; దాపరికము
Self-complacency : ఆత్మతృప్తి; కృతార్థత
Self-conceit : దురభిమానము; అహంకారము; గర్వాతిశయము
Self-esteem : స్వాతిశయము
Self-exaltation : ఆత్మోన్నతి
Self-respect : మానము; మానుషము; ఆత్మగౌరవము; ఆత్మాభిమానము
Superciliousness : నడతయందు ఉద్ధతి
Vainglory : ఆడంబరము; డంబములు చెప్పకొనుట; అహంకారము
Vanity : బడాయి; నిరర్థకత; నిస్సారత

*Antonyms* వ్యతిరేకార్థకములు

Humility : అణకువ; నిరహంకారము
Lowliness : నమ్రత
Meekness : సాధుత్వము; నమ్రత
Modesty : సౌమ్యత; వినయము, పుచ్చటిక
Self-abasement : తన్నుతాను తక్కువపరచుకొనుట
Self-distrust : ఆత్మవిశ్వాసము లేకుండుట

**PRIMEVAL : సనాతనమైన; ప్రాక్తనమైన; ఆద్యమైన; ఆదికాలికమైన**

*Synonyms* సమానార్థకములు

Aboriginal : ఆదిమమైన; అనాదియైన
Ancient : ప్రాచీనమైన; పురాతనమైన

**Autochthonic** : ఆదిమవాసులకు సంబంధించిన
**Immemorial** : సనాతనమైన: అనాదియైన
**Indigenous** : స్వదేశీయమైన: దేశీయమైన
**Native** : సహజమైన; దేశీయమైన
**Old** : ముదియగు; ప్రాతదైన; ముసలిదైన; ప్రాచీనమైన, ప్రాయము గలదైన
**Original** : ప్రథమమైన, ఆదిమమైన; మూలమైన
**Patriarchal** : పూర్వకాలపు
**Primal** : ఆదిమమైన
**Primary** : మొదటిదైన; మూలమైన; ప్రథమమైన
**Prime** : ప్రథమమైన; శ్రేష్ఠమైన
**Primitive** : ప్రాక్తనమైన; అనాగరికమైన; సంస్కారహీనమైన
**Primordial** : బీజభూతమైన; ఆదిమమైన; సృష్టియందు మొదటిదైన
**Pristine** : ప్రాచీనమైన; ఆదిమమైన
**Uncreated** : సృష్టింపబడని; స్వయంభువైన

*Antonyms* వ్యతిరేకార్థకములు

**Adventitious** : ఆగంతుకమైన; ఆకస్మికముగా సంభవించెడు
**Exotic** : విజాతీయమైన; అన్యదేశ్యమైన; పరదేశీయమైన
**Fresh** : అభినవమైన; నిర్మలమైన; క్రొంగ్రొత్తయగు; వాడిపోని; అలసిపోని; నూతనమైన
**Foreign** : విదేశీయమైన; విజాతీయమైన; విరుద్ధమైన
**Late** : పరిణతమైన
**Modern** : క్రొత్తయగు; నూతనమైన; ఆధునికమైన
**New** : క్రొత్తయైన, నూతనమైన; నవీనమైన; అపూర్వమైన; తాజాయైన
**Novel** : క్రొత్తదగు; అపూర్వమగు
**Recent** : ఇటీవలి, నూతనమైన; అచిరప్రవృత్తమైన

**PRINCIPAL** : **ముఖ్యమైన; ప్రధానమైన**

*Synonyms* సమానార్థకములు

**Capital** : శ్రేష్ఠమైన; అత్యుత్తమమైన; ప్రధానమైన, శిరస్సంబంధమైన
**Cardinal** : ముఖ్యమైన, ప్రధానమైన
**Chief** : ముఖ్యమైన, ప్రధానమైన
**Controlling** : అదుపులో పెట్టెడు; అధికారకమైన
**Dominant** : ప్రబలమైన; ముఖ్యమైన
**First** : ఆద్యమైన, ప్రథమమైన
**Foremost** : పరిష్ఠమైన, శ్రేష్ఠమైన; ప్రప్రథమమైన
**Greatest** : బాగాగొప్పదైన, సుప్రసిద్ధమైన; ఘనతమమైన
**Highest** : అత్యున్నతమైన, అధికతమమైన
**Leading** : దారితీసెడు; దారిచూపెడు; ప్రధానమైన, ముందుగానున్న
**Main** : ప్రధానమైన
**Predominant** : ప్రబలమైన; ప్రముఖమైన
**Predominating** : ప్రబలమగుచున్న; అధికమగుచున్న
**Preeminent** : సర్వోత్తమమైన; శ్రేష్ఠమైన
**Prevailing** : నెగడెడు; వ్యాపించెడు; చెల్లుబడియగు; జయించెడు; ఒప్పించెడు

**Prime** : ప్రథమమైన; శ్రేష్ఠమైన
**Prominent** : ఉన్నతమైన; ప్రముఖమైన; ప్రధానమైన
**Supereminent** : సర్వశ్రేష్ఠమైన
**Superior** : శ్రేష్ఠమైన; మేలురమైన; అగ్గలమైన
**Supreme** : పరమమైన; అత్యుత్తమమైన; అతిశ్రేష్ఠమైన
**Surpassing** : మించిన; అతిశయించిన; ఉత్కృష్టమైన

*Antonyms* వ్యతిరేకార్థకములు

Accessory : సహకారియైన; ఉపకరణమైన
Added : కూర్పబడిన, సంకలితము చేయబడిన
Additional : అధికముగా చేరిన; హెచ్చిన
Assistant : చేదోడైన; సహాయకారియైన; సహకారియైన
Auxiliary : సహాయకమైన; ఉపక్రియాత్మకమైన
Contributory : అనుకూలము చేసెడు; సహాయము చేసెడు
Helping : సాయము చేసెడు; ఉపకరించెడు
Inconsiderable : అల్పమైన; సామాన్యమైన; ఆలోచింపనక్కరలేని
Inferior : అవరమైన; అధమమైన; కనిష్ఠమైన; అల్పమైన
Minor : అప్రధానమైన; చిల్లరయైన; యుక్తవయస్సురాని
Negligible : ఉపేక్షణీయమైన; పాటింపరాని; ఉంతవ్యమైన
Secondary : గౌణమైన; అప్రధానమైన
Subject : స్వాధీనమైన; లోపడిన; పాత్రయైన



**Subordinate** : లోపడి ఉండెడు; అప్రధానమైన
**Subsidiary** : సహకారియైన; సహాయకరమైన
**Supplemental** : పరిపూర్తికొరకు చేర్పబడిన

**PROFIT : లాభము; ఆదాయము; ప్రయోజనము**

*Synonyms* సమానార్థకములు

Advantage : సదవకాశము, అనుకూల్యము; మేలు; లాభము; ప్రయోజనము
Avail : ప్రయోజనము; ఉపయోగము
Benefit : లాభము; మేలు, ఉపకారము
Emolument : ప్రతిఫలము, రుసుము; లబ్ధి
Expediency : తన మేలునకు అనుకూలత; ఆవశ్యకత; ఉపయుక్తత; ప్రయోజనము
Gain : లాభము; ఆదాయము, ఫలము
Good : శ్రేయము; శుభము
Improvement : అభివృద్ధి; వాసి; సంస్కరణము
Proceeds : ఫలము; అమ్మిట మొ. వాని వలన వచ్చిన సొమ్ము
Receipts : రాబడి; వచ్చుబడి, జమ
Return : మారుసేత; అగమనము; చెల్లింపు; ఫలము; లాభము
Returns : ఫలము; జమ
Service : ఉపచారము; సేవ; కొలువు; ఫలము
Usefulness : ఉపయోగము; ఉపయుక్తత
Utility : ఉపయోగము; ప్రయోజనము; ఫలము; లాభము
Value : వెల; విలువ; మూల్యము; కిమ్మతు; యోగ్యత

*Antonyms* వ్యతిరేకార్థకములు

Damage : నష్టము; హాని; చెరుపు
Destruction : లయము; నాశము; సంహారము
Detriment : నష్టము; కీడు; హాని
Disadvantage : అననుకూలత; నష్టము; చెరుపు
Harm : చెరుపు; హాని; కీడు; అపకారము; ఎగ్గు
Hurt : గాయము; నొప్పి
Injury : గాయము; హాని; ఎగ్గు
Loss : నష్టము; లోటు; లుగసాను; కోలుపోక
Ruin : నాశము; పాడగుట; ధ్వంసము
Waste : దుబారా; దుర్వ్యయము

**PROGRESS : పెంపు; అభివృద్ధి**

*Synonyms* సమానార్థకములు

Advance : అభివృద్ధి
Advancement : పురోగమనము; అభివృద్ధి
Attainment : సిద్ధి; సంపాదనము
Development : పెంపు; వికాసము
Growth : పెంపు; పెరుగుదల; వృద్ధి
Improvement : బాగగుట; అభివృద్ధి; వాసి
Increase : పెంపు; లాభము
Proficiency : కౌశలము; ప్రవీణత; నైపుణి
Progression : గతి; గమనము; వృద్ధి

*Antonyms* వ్యతిరేకార్థకములు

Check : అడ్డు; నిరోధము
Decline : క్షీణదశ
Delay : జాగు; విలంబము; ఆలస్యము; జాలము
Falling off : తగ్గిపోవుట; విడిచిపెట్టిపోవుట; జారిపోవుట; తొలగిపోవుట
Relapse : పునః ప్రకోపము; మునుపటి చెడ్డస్థితికి వచ్చుట
Retrogression : ప్రతీపగమనము; వక్రగమనము; వెనుకకు పోవుట; వెనుకకు నడచుట
Stay : నిలుపుదల; ఉనికి
Stop : ఆటంకము; అడ్డగింత; నిలుపుదల
Stoppage : నిలిచిపోవుట; అడ్డగింత; అడ్డము

**PROHIBIT : నిషేధించు**

*Synonyms* సమానార్థకములు

Ban : నిషేధించు; బహిష్కరించు
Debar : నిరోధించు; తొలగించు
Disallow : అంగీకరింపకపోవు; నిషేధించు; కూడదను
Forbid : నిషేధించు; కూడదను; వలదను
Hinder : అడ్డగించు; ఆటంకపరచు
Inhibit : ఆపు; ఆటంకపరచు
Interdict : అడ్డగించు; కూడదని ఆటంకపరచు
Ostracize : వెలివేయు
Preclude : నిరోధించు; ఆటంకపెట్టు; నివారించు
Prevent : ఆపు; నిలుపు; అరికట్టు

*Antonyms* వ్యతిరేకార్థకములు

Allow : అనుమతించు
Authorize : అధికారమిచ్చు; నియోగించు
Command : శాసించు; విధించు
Consent to : ఒడబడు; సమ్మతించు

**Direct** : ఆదేశించు; దారిచూపు
**Empower** : అధికారమిచ్చు
**Enjoin** : ఆజ్ఞాపించు
**Give consent** : అంగీకరించు
**Give leave** : అనుమతించు
**Give permission** : అనుజ్ఞ ఇచ్చు; ఉత్తరువిచ్చు; అనుమతిఇచ్చు
**Let** : అనుమతించు
**License** : అనుజ్ఞ ఇచ్చు; ఉత్తరువిచ్చు
**Order** : ఆజ్ఞాపించు; క్రమపరచు
**Permit** : అనుమతించు
**Put up with** : సహించు; ఓర్చుకొను
**Require** : అపేక్షించు; కోరు; అడుగు
**Sanction** : అనుమతించు; మంజూరుచేయు
**Suffer** : అనుభవించు; ఓర్చు; నష్టపడు; సహించు; సమ్మతించు
**Tolerate** : సహించు; ఓర్చు
**Warrant** : అభయమిచ్చు; సెలవుఇచ్చు; ఉత్తరువుఇచ్చు

**PROJECT : యుక్తి; కల్పన; యోచన; ఉపాయము; యత్నము**

*Synonyms* సమానార్థకములు

**Contrivance** : యుక్తి; తంత్రము; పన్నుగడ
**Design** : నమూనా; తలంపు; ఎత్తుగడ
**Device** : తంత్రము; పన్నుగడ; ఉపాయము
**Invention** : నూతనకల్పన; నూతనసృష్టి
**Plan** : పథకము; కల్పన; ప్రణాళిక
**Purpose** : ఉద్దేశము; ప్రయోజనము; లక్ష్యము
**Scheme** : పథకము; యుక్తి

*Antonyms* వ్యతిరేకార్థకములు

**Accomplishment** : కృతార్థత; సిద్ధి; ప్రవీణత
**Achievement** : కార్యసిద్ధి; నిర్వహణము; ఘనకార్యము
**Act** : క్రియ; కార్యము; పని
**Deed** : చేత; పని; పత్రము; దస్తావేజు
**Doing** : చేత; కృత్యము; పని
**Execution** : అమలు; రచన: కార్యనిర్వహణము
**Performance** : ఆచరణము; ప్రదర్శనము
**Producton** : ఉత్పత్తి; చేత
**Work** : పని; పాటు; కర్మ

**PROMOTE : ఉన్నతికితెచ్చు; వృద్ధిపరచు**

*Synonyms* సమానార్థకములు

**Advance** : వృద్ధికితెచ్చు; వృద్ధిపొందు; ముందుకుపోవు; సాగిపోవు
**Aid** : సాయముచేయు; ఉపకరించు
**Assist** : తోడ్పడు; సాయముచేయు
**Elevate** : ఉన్నతపరచు; ఉల్లాసపరచు
**Encourage** : ప్రోత్సహించు; బరవసము చేయు
**Exalt** : పైకెత్తు; గొప్పచేయు; స్తుతించు; ఉన్నతస్థితిలోపెట్టు
**Excite** : ఎసగొల్పు; పురిగొల్పు; రెచ్చగొట్టు; ఉద్రేకపరచు
**Foment** : పురికొల్పు; ప్రోత్సహించు
**Forward** : రవానా చేయు; పంపు; సహాయము చేయు
**Foster** : సాకు; పాలించు; పెంచు
**Further** : పెంపుచేయు; ప్రోత్సహించు
**Help** : సాయపడు; ఉపకరించు
**Prefer** : మేతేర్చు; మేల్తరము గావించు
**Push** : గెంటు; బలముతో ముందుకు త్రోయు; నూకు

Push on : సాగిపోవు
Raise : లేవనెత్తు; సేకరించు; పండించు; ప్రోగుచేయు; ఉన్నతికి తెచ్చు
Urge forward : ప్రేరేచు
Urge on : ప్రోత్సహించు

*Antonyms* : See synonyms for ALLAY; DEBASE

**PROPAGATE : సంతానమును కను; కనిపించు; ప్రచారము చేయు**

*Synonyms* సమానార్థకములు

Beget : కను; కలిగించు; పుట్టించు
Breed : కను; పోషించు; పెంచు; కలిగించు; సంభవింపజేయు
Engender : కలుగజేయు; కలిగించు; పుట్టించు
Generate : పుట్టించు; కలిగించు
Increase : పెంపుచేయు; పెంపారు; వృద్ధియగు
Multiply : గుణించు; హెచ్చువేయు
Originate : కలుగజేయు; పొడము; ప్రవర్తింపజేయు; పుట్టు; ఆరంభమగు
Procreate : కను; పుట్టించు; ఉత్పత్తిచేయు
Reproduce : నవీకరించు; పునర్ఘటించు; తిరిగి ఉత్పాదన చేయు
Sire : పుట్టించు
Spread : అలముకొను; వ్యాపించు; విస్తరిల్లు; పరచు; చాచు

*Antonyms* వ్యతిరేకార్థకములు

Annihilate : నిర్మూలించు; సర్వనాశనము చేయు
Destroy : నశింపజేయు; సంహరించు; పాడుచేయు; చెడగొట్టు

Eradicate : నిర్మూలము చేయు; ఉత్పాటించు
Exterminate : తుద ముట్టించు; నిర్మూలించు
Extirpate : నిర్మూలము చేయు: నాశము చేయు
Root out : దుంపనాశము చేయు; నిర్మూలము చేయు; వేరుతో పెకలించు
Root up / Uproot : పిల్ల వేళ్లతో పెకలించు

**PROPITIATION : అనుగ్రహ సంపాదనము; వేడికోలు: ప్రసన్నత**

*Synonyms* సమానార్థకములు

Atonement : ప్రాయశ్చిత్తము; నిష్కృతి; పాప పరిహారము; చెల్లింపు
Expiation : ప్రాయశ్చిత్తము; పాపపరిహారము
Reconciliation : సమాధానము; సంధి; రాజీనామా; మరల స్నేహము
Satisfaction : తృప్తి; తనివి; పరితృప్తి

*Antonyms* వ్యతిరేకార్థకములు

Alienation : పరాధీనము చేయుట; విరక్తి
Chastisement : శిక్ష; దండనము
Condemnation : నింద; దూషణ; నిరాకరణ; తిరస్కారణ; గర్హణ; తప్పిదముగా ఎంచుట
Curse : శాపము; తిట్టు
Estrangement : వైమనస్యము; విరోధము: స్నేహభంగము
Offense : నేరము; అపరాధము; ద్రోహము; కోపము; అపచారము
Penalty : దండన; శిక్ష; శాస్తి

Punishment : శిక్ష; దండనము; శాస్తి
Reprobation : గర్హణ; దుష్టత
Retribution : కర్మఫలము; శిక్ష; కర్మపరిపాకము
Vengeance : పగ; కసి; ప్రత్యపకారము
Wrath : తీవ్రకోపము

**PROPITIOUS : ప్రసన్నమైన; కృపగల; అనుకూలమైన**

*Synonyms* సమానార్థకములు

Auspicious : శుభమైన; మంగళప్రదమైన; అనుకూలమైన
Benign / Benignant : సరసమైన; కనికరముగల; హితమైన
Clement : సదయమైన; సుఖకరమైన; దయగల; కనికరముగల
Favorable : అనుకూలమైన; ఉపయుక్తమైన; ప్రసన్నమైన; సుముఖమైన
Fortunate : అదృష్టముగల; భాగ్యముగల
Friendly : ప్రీతిగల; విశ్వాసముగల; దయగల; స్నేహముగల
Gracious : సదయమైన; కృపగల; దయాళువైన; అనుగ్రహముగల
Kind : దయగల; కనికరముగల, ఉపకారగుణముగల
Kindly : దయగా; ప్రీతిగా; దయాళువైన
Lucky : అదృష్టముగల; భాగ్యముగల
Merciful : కృపగల; దయగల
Suitable : యోగ్యమైన; అనుకూలమైన; ఒప్పిదమైన

*Antonyms* వ్యతిరేకార్థకములు

Adverse : ప్రతికూలమైన; విరుద్ధమైన; ఎదురైన
Antagonistic : వైరముగల; విరోధముగల
Forbidding : అసహ్యకరమైన; వెగటును పుట్టించెడు
Hostile : ప్రతికూలమైన; విరోధముగల
Ill-disposed : ప్రతికూలమైన; సుముఖము కాని
Inauspicious : అశుభమైన; దుశ్శకునపు; దురదృష్టమగు
Repellent : తిరుగగొట్టునట్టి; నిరోధకమైన; నివారకమైన
Unfavorable : ప్రతికూలమైన; విరుద్ధమైన
Unfriendly : విరోధముగల; శత్రువైన; ప్రతికూలమైన
Unpropitious : అప్రసన్నమైన; అననుకూలమైన

**PROPOSAL : ప్రతిపాదనము; ఆలోచనీయాంశము; సూచన; ప్రస్తావన.**

*Synonyms* సమానార్థకములు

Bid : వేలముపాట; ఆహ్వానము; ఆదేశము; అనతి
Motion : ప్రస్తావము
Offer : యత్నము; సమర్పణము
Overture : ప్రస్తావము; అభిప్రాయ వ్యక్తీకరణము
Proposition : ఆలోచనకు పెట్టబడిన విషయము
Suggestion : సూచన; జాడ

*Antonyms* వ్యతిరేకార్థకములు

Acceptance : అంగీకారము; సమ్మతి; కైకోలు
Denial : ప్రత్యాఖ్యానము; నిరాకరణము

**Disapproval** : అసమ్మతి; అనంగీకారము
**Refusal** : నిరాకరణము; అనంగీకారము; అసమ్మతి
**Rejection** : నిరాకరణము; త్రోసిపుచ్చుట
**Repulse** : వెనుకకు కొట్టుట; ప్రతిహతము చేయుట

**PROPOSE: సూచించు; ఆలోచనకు పెట్టు**

*Synonyms* సమానార్థకములు

**Design** : కల్పనచేయు; నమూనావ్రాయు; సంకల్పించు
**Intend** : తలచు; ఉద్దేశించు
**Mean** : తలచు; ఎంచు
**Purpose** : ఉద్దేశించు

**PROTRACT : జాగుచేయు; పెంచు; దీర్ఘముచేయు**

*Synonyms* సమానార్థకములు

**Adjourn** : మరియొకవేళకు నిలిపిపెట్టు
**Continue** : కొనసాగించు; ఎడతెగకుండు; జరుగు
**Defer** : నిలిపిపెట్టు; అత్ష్యపెట్టు
**Delay** : ఆలసించు; తడయు
**Draw out** : సాగతీయు; వెలువరించు
**Elongate** : సాగదీయు; పొడిగించు; సాగగొట్టు
**Extend** : వ్యాపించు; విస్తరిల్లజేయు; పొడిగించు; ప్రసరింపజేయు
**Lengthen** : పొడిగించు; సాగదీయు
**Postpone** : వాయిదావేయు; కాలాంతరమునకు త్రోసిపుచ్చు
**Procrastinate** : కాలయాపనచేయు; ఆలస్యముచేయు; విలంబముచేయు
**Prolong** : పెంచు; పొడిగించు

*Antonyms* వ్యతిరేకార్థకములు

**Abbreviate** : సంగ్రహపర్చు; సంక్షేపించు
**Abridge** : తగ్గించు; టూకించు; సంగ్రహపర్చు
**Conclude** : ముగించు; నిశ్చయించు
**Contract** : ముడుచుకొనిపోవు; అదుము
**Curtail** : తగ్గించు; సంక్షేపించు
**Hasten** : వేగిరించు; ఉరవడించు; త్వరపడు
**Hurry** : త్వరపెట్టు; వేగిరించు
**Limit** : పరిమితిలోపెట్టు; హద్దులోపెట్టు; కొలది ఏర్పరచు
**Reduce** : తగ్గించు; అణచు
**Shorten** : కురచచేయు; తగ్గించు

**PROVERB : సామెత; లోకోక్తి**

*Synonyms* సమానార్థకములు

**Adage** : సామెత
**Aphorism** : సూక్తి; నీతివాక్యము; సూత్రము
**Apothegm** : సూత్రము; నీతివాక్యము
**Axiom** : స్వతఃసిద్ధాంతము
**Byword** : సామెత; లోకోక్తి
**Dictum** : విధివాక్యము; సూత్రము; గట్టిమాట; నియమము
**Epigram** : చాటువు; పొడుపుమాట; నీతివాక్యము
**Maxim** : సూక్తి; నీతివచనము; సామెత; సూత్రము
**Motto** : నీతివాక్యము; శీర్షిక; ముద్రిక; దీక్షావాక్యము; ధర్మపన్నము
**Precept** : ధర్మనియమము; ధర్మసూత్రము; ఆజ్ఞ
**Saw** : సామెత; లోకోక్తి
**Saying** : పలుకుబడి; లోకోక్తి

Truism : ప్రత్యక్షమైననిజము; స్పష్టమైన నిజము; సత్యము

**PROWESS : విక్రమము; పరాక్రమము; మగటిమి**

*Synonyms* సమానార్థకములు

Bravery : ధైర్యము; బంటుతనము; వీరము
Courage : శౌర్యము; ధైర్యము; సాహసము
Gallantry : సాహసము; ఔదార్యము; స్త్రీలయెడ గౌరవము
Heroism : శౌర్యము; పరాక్రమము
Intrepedity : ధీరత్వము; సాహసము; ధైర్యము
Valor : పరాక్రమము; ధైర్యము

*Antonyms* వ్యతిరేకార్థకములు

Cowardice : పిరికితనము; పందతనము
Cowardliness : భీరుత్వము
Effeminacy : ఆడంగితనము; పెంటితనము
Fear : భయము; బెదురు; ఓటు; శంక
Pusillanimity : పిరికితనము
Timidity : అళుకు; పిరికితనము

**PRUDENCE : వివేకము; పొదుపరితనము**

*Synonyms* సమానార్థకములు

Care, Carefulnass : శ్రద్ధ; అద; అవేక్షణ; కాపుదల; సంరక్షణ; జాగ్రత
Caution : హెచ్చరిక; మెలకువ; జాగరూకత
Circumspection : జాగ్రత; హెచ్చరిక; వివేకము
Consideration : ఆలోచన; విచారణ; ప్రతిఫలము; హేతువు
Discretion : వివేకము; ఇచ్ఛ; ఇష్టము
Forecast : భావి సూచన
Foresight : దూరదృష్టి; ముందుచూపు
Forethought : ముందాలోచన; ముందు జాగ్రత్త
Frugality : పొదుపు; మితవ్యయము; పోడిమి
Judgment : తీర్పు; అభిప్రాయము; సత్య నిర్ణయము
Judiciousness : వివేకము; తెలివితేటలు
Providence : దైవము; దైవసహాయము
Wisdom : తెలివి; జ్ఞానము

*Antonyms* వ్యతిరేకార్థకములు

Folly : అవివేకము
Heedlessness : అలక్ష్యము
Improvidence : అజాగ్రత్త
Imprudence : ముందుజాగ్రత్తలేమి
Indiscretion : వివేచనాహీనత
Prodigality : అతివ్యయము; దుబారా
Rashness : తొందరపాటు
Recklessness : అనాలోచితప్రవర్తన
Thoughtlessness : బుద్ధిహీనత

**PUNISH : శిక్షించు; దండించు**

*Synonyms* సమానార్థకములు

Afflict : ఎరియించు; నొప్పించు; వ్యథపెట్టు
Castigate : దండించు; శిక్షించు; దెబ్బలు కొట్టు; తీవ్రముగా విమర్శించు
Chasten : సంస్కరించు; బాగుచేయు; సరిదిద్దు; సాధుత్వము అలవర్చు; శిక్షించు
Chastise : కొట్టు; దండించు
Correct : సరిచేయు; సవరించు; దిద్దు

Discipline నేర్పు; క్రమశిక్షణకు కట్టుపడ చేయుట
Humble : లొంగదీయు; అణచివేయు; అవమానపర్చు
Subdue : అణచు; వంచు; లొంగదీయు; జయించు; నిగ్రహించు

**PURCHASE : కొను; సంపాదించు**

*Synonyms* సమానార్థకములు

Acquire : ఆర్జించు; గడించు
Bargain for : బేరముచేయు; బేరమాడు
Barter for : మార్చుకొను; వినిమయము చేసికొను; సాటాబేరమాడు
Buy : కొను
Get : సంపాదించు; చేరు; పొందు; తెచ్చు
Obtain : పొందు; సంపాదించు
Procure : సంతరించు; ఒనగూర్చు
Secure : భద్రముచేయు; జతపర్చు; చిక్కించుకొను

*Antonyms* వ్యతిరేకార్థకములు

Barter : ప్రతిదానముచేయు; వినిమయము చేయు; సాటాబేరమునకు ఇచ్చివేయు
Dispose of : తీర్చివేయు; అమ్మివేయు; ఇచ్చివేయు
Exchange : మారకముచేయు; మార్పు చేయు
Put to sale : అమ్మకమునకు పెట్టు
Sell : అమ్ము; విక్రయించు

**PURE : అచ్చమైన; శుద్ధమైన; పవిత్రమైన; నిర్మలమైన; నిర్దుష్టమైన**

*Synonyms* సమానార్థకములు

Absolute : కేవలమైన; శుద్ధమైన; అనన్య సంబద్ధమైన; సర్వ స్వతంత్రమైన; నిరంకుశమైన
Chaste : పరిశుద్ధమైన; నిర్దుష్టమైన; సాధువైన
Classic : } శ్రేష్ఠమైన; ఉత్తమశ్రేణికి చెందిన; సంప్రదాయ సిద్ధమైన
Classical :
Clean : నిర్మలమైన; పరిశుభ్రమైన; శుచియైన; పరిపూర్ణమైన
Clear : విశదమైన; తెల్లమైన; స్పష్టమైన; నిర్మలమైన
Continent : కచ్చశుద్ధిగల; దాంతతగల: ఇంద్రియ నిగ్రహముగల
Genuine : అచ్చమైన; శుద్ధమైన, వాస్తవమైన; నిష్కళంకమైన; అకృత్రిమమైన
Guileless : నిష్కపటమైన; కల్లకపటము లేని; ధారాళమైన
Guiltless : నిర్దోషియైన; తప్పుచేయని; పాపరహితమైన
Holy : పావనమైన, పవిత్రమైన
Immaculate : పరిశుద్ధమైన; నిర్దుష్టమైన
Incorrupt : నిజాయితీయయిన; ఆశకు లొంగని; లంచగొండికాని
Innocent : అమాయకమైన; అనపరాధియైన
Mere : అచ్చమైన; కేవలమైన; వట్టిదైన
Perfect : అనూనమైన; సంపూర్ణమైన; నిర్దుష్టమైన; కొరతలేని; శుద్ధమైన
Real : వాస్తవమైన; యథార్థమైన; నిజమైన; అచ్చమైన; అకృత్రిమమైన
Sheer : స్వచ్ఛమైన; కేవలమైన; మిశ్రము కాని
Simple : సరళమైన: సాదాయైన; సాధువైన; నిరాడంబరమైన; సులభమైన
Spotless : నిష్కళంకమైన; అనింద్యమైన
Stainless : మచ్చలేని; మాలిన్యములేని; నిష్కళంకమైన

True : నిజమైన; యథార్థమైన; వాస్తవమైన; సత్యమైన; అచ్చమైన
Unadulterated : కల్తీలేని; పరిశుభ్రమైన అచ్చమైన
Unblemished : నిష్కళంకమైన, దోషరహితమైన
Uncorrupted : చెడని; క్రుళ్లని; ఆభాసము కాని
Undefiled : అమలినమైన; శుచియైన; అంటుకాని; భ్రష్టుకాని; అపవిత్రముకాని
Unmingled : వేరుచేయబడిన; ప్రత్యేకింపబడిన
Unmixed : మిశ్రముకాని; శుద్ధమైన; అచ్చమైన
Unpolluted : అపవిత్రముకాని; దోషరహితమైన; అంటుకాని; చెడని
Unspotted : నిర్మలమైన; మచ్చలేని
Unstained : పరిశుద్ధమైన; నిష్కళంకమైన
Unsullied : మరకపడని; మాపుకాని
Untainted : నిష్కళంకమైన; అమలినమైన; కీర్తిమంతమయిన
Untarnished : కాంతిహీనముకాని; అపయశస్సులేని
Upright : సరళమైన; తిన్నని; నిజాయితీగల
Virtuous : నీతిమంతుడైన; సన్మార్గుడైన ధర్మిష్ఠమైన; పుణ్యప్రదమైన

*Antonyms* వ్యతిరేకార్థకములు

Adulterated : కల్తీచేయబడిన; మిశ్రముచేసి చెరచబడిన; అపరిశుభ్రమైనవానిని కలిపి చెరచబడిన
Defiled : అపవిత్రముచేయబడిన; మైలపడిన
Dirty : మలినమైన· మురికైన
Filthy : మురికైన; కశ్మలముతో కూడిన; అసహ్యమైన
Foul : మలినమైన; అనుచితమైన; రోత పుట్టించెడు
Gross : కసమైన; మోటైన; జడమైన; లజ్జాకరమైన
Immodest : లజ్జలేని; సిగ్గుమాలిన
Impure : అపరిశుద్ధమైన; మలినమైన; అపవిత్రమైన
Indecent : అసభ్యమైన
Indelicate : అమర్యాదయైన; బండయైన; నాజూకు కాని; అశ్లీలమైన
Lewd : పోకిరయైన; కామాతురముగల
Mixed : మిశ్రీకృతమైన; కలసి పోయిన
Obscene : అశ్లీలకరమైన
Polluted : అపవిత్రము చేయబడిన
Stained : మచ్చతో కూడిన; మలినమైన
Tainted : దోషముతో కూడిన; కళంకితమైన
Tarnished : కాంతిహీనమైన
Unchaste : వ్యభిచరించెడు; పోకిరియైన; శీలహీనమైన
Unclean : మలినమైన; అపరిశుభ్రమైన

**PUT : పెట్టు; ఉంచు; వేయు; దారికి తెచ్చు**

*Synonyms* సమానార్థకములు

Deposit : ఇల్లడపెట్టు; దాచియుంచు; నిక్షేపించు
Lay : ఉంచు; పెట్టు; విధించు; మోపు; మిగిలించు
Place : ఉంచు; నియమించు
Set : ఉంచు; సంఘటించు

**QUARREL : జగడము; పోరు; కలహము**

*Synonyms* సమానార్థకములు

Affray : కొట్లాట; రగడ; రచ్చ
Animosity : వైరము; పగ
Bitterness : కఠినత; చలము, పగ; దుఃఖము
Brawl : సందడి; జగడము; ఘర్షణ
Broil : కలహము; రగడ
Conflict : పోరాటము; విరోధము; విరుద్ధత్వము; చిత్తసంక్షోభము
Contention : వివాదము; పోరు
Contest : పోటీ; పంతము
Controversy : వివాదము
Dispute : తగువు; వాదము
Dissension : అభిప్రాయ భేదము; కలహము
Enmity : శత్రుత్వము; పగ; ఒంటరము
Feud : జ్ఞాతివైరము; దాయాదవైరము
Fight : పోరాటము; యుద్ధము
Fracas : అల్లరి; గలాభా; గడబిడ
Fray : కొట్లాట; జగడము; అల్లరి
Hostility : వైరము; విరోధము
Riot : దొమ్మి; కోలాహలము
Row : అల్లరి; కలకలము
Squabble : చిన్నతగువు; కీచులాట
Strife : జగడము
Wrangle : పెనగులాట; కలహము

**QUEER : విపరీతమైన; సందేహాస్పదమైన**

*Synonyms* సమానార్థకములు

Anomalous : అసంగతమైన; ఎగుడు దిగుడైన; విపరీతమైన
Bizarre : వికృతమైన; విలక్షణాకారము గల
Comical : హాస్యకరమైన, వికారమైన
Crotchety : దురభిమానముగల; పిచ్చిఅభిప్రాయముగల
Curious : కుతూహలముగల; వింతయైన; విచిత్రమైన, అపురూపమైన
Droll : విచిత్రమైన; వికారమైన; వేడుకయైన
Eccentric : అసహజమైన, పిచ్చిగానున్న; లోకరీతివిరుద్ధమైన
Erratic : నియమములేక సంచరించెడు; పనిలేకతిరిగెడు
Extraordinary : అసాధారణమైన; అసామాన్యమైన; విపరీతమైన
Fantastic : విపరీతమైన; చోద్యమైన
Funny : తమాషైన; వేడుకైన; చిత్రమైన
Grotesque : వింతయైన; వికృతమైన; వికారమైన
Laughable : నవ్వుపుట్టించెడు
Ludicrous : హాస్యాస్పదమైన
Odd : వింతయైన; అపూర్వమైన
Outlandish : దేశాతీతమైన; వింతయైన; అనాగరికమైన; గ్రామ్యమైన; వికృతమైన
Peculiar : విలక్షణమైన
Preposterous : అసంగతమైన, వివేకహీనమైన
Quaint : వింతయైన; విడ్డూరమైన
Ridiculous : హాస్యాస్పదమైన; నవ్వులచేటైన
Singular : అపూర్వమైన; నిరుపమమైన; విలక్షణమైన
Strange : వింతయైన; అసాధారణమైన
Uncommon : అసాధారణమైన; అసామాన్యమైన

Unique : అద్వితీయమైన; నిరుపమాన మైన
Unmatched ; సాటిలేని
Unusual : అసామాన్యమైన
Whimsical : చపలమైన; చాదస్తమైన; పోకిళ్లమారియైన

*Antonyms* వ్యతిరేకార్థకములు

Common : సాదాయైన; సామాన్యమైన; సాధారణమైన; మామూలైన; ప్రాయిక మైన
Customary : వాడుకైన; మామూలైన
Familiar : సుపరిచితమైన
Natural : సహజమైన; నిసర్గమైన
Normal : ప్రమాణబద్ధమైన; సాధారణ మైన, నియమానుసారమైన
Ordinary : సామాన్యమైన; సహజమైన
Regular : నియమితమైన; క్రమబద్ధమైన
Usual : మామూలైన; సహజమైన; సాధారణమైన

**QUESTION : ప్రశ్న; విమర్శ; పరీక్ష; సంగతి; సందేహము; ప్రస్తుతాంశము**

*Synonyms* సమానార్థకములు

Doubt : శంక; సందేహము; ఆశంక
Inquire : విచారణ; విమర్శము, శోధనము దర్యాప్తు; జిజ్ఞాస
Inquisition : దర్యాప్తు; భోగట్టా
Interrogation : ప్రశ్న; విచారణ
Interrogatory : ప్రశ్నార్థకమైన
Investigation : విచారణ; పరిశీలన; శోధన; దర్యాప్తు
Query : ప్రశ్న

**QUICKEN : చురుకుపర్చు; వేగపర్చు: తొందరపెట్టు**

*Synonyms* సమానార్థకములు

Accelerate : త్వరపెట్టు; వేగిరించు
Advance : సాగిపోవు; ముందుకుపోవు
Dispatch : త్వరగాపంపు; చంపు; ముగించు
Drive : నడుపు; తోలు; తరుము; వెళ్లగొట్టు; దిగగొట్టు
Drive on : ముందుకునడుపు
Expedite : వేగిరించు; వేగిరపడు
Facilitate : సుకరముచేయు
Further : పెంపుచేయు; ప్రోత్సహించు
Hasten : ఉరవడించు; త్వరపడు; వేగిరించు
Hurry : త్వరపెట్టు; వేగిరించు
Make haste : త్వరపడు; వేగిరపడు
Press forward :ముందుకుత్రోయు
Promote : ఉన్నతికితెచ్చు; వృద్ధిపరచు
Speed : పనిలో వేగిరించు
Urge : ప్రేరేచు
Urge on : బలవంతముచేయు; ప్రోత్సహించు

*Antonyms* వ్యతిరేకార్థకములు

Check : వారించు; ఆటంకపరచు; అణచు; నిగ్రహించు
Clog : గుదికర్ర కట్టు
Delay : ఆలసించు; తడయు
Drag : ఈడ్చు; లాగు
Hinder : అడ్డగించు; ఆటంకపర్చు
Impede : నిరోధించు; ఆటంకపర్చు
Obstruct : అరికట్టు; అడ్డగించు; నిరోధించు
Retard : మందగింపజేయు; ఆటంకపర్చు

**QUOTE : ఉల్లేఖించు; ఉదాహరించు; వెలచెప్పు**

*Synonyms* సమానార్థకములు

Cite : ఉదాహరించు; ఒకగ్రంథమునుండి ప్రమాణము చూపిచెప్పు
Excerpt : ఉద్ధరించు; ఉల్లేఖించు
Extract : గ్రంథభాగము నుద్ధరించు
Paraphrase : వ్యాఖ్యానించు; దండాన్వయముచేయు; టీకవ్రాయు
Plagiarize : గ్రంథచౌర్యముచేయు
Recite : పఠించు; ఒప్పగించు
Repeat : వల్లించు; తిరిగిచెప్పు

**RACE : వంశము; జాతి; కులము**

*Synonyms* సమానార్థకములు

Folk : జనము
Nation : జాతి; దేశము
People : జనసమూహము; ప్రజ
Population : జనాభా
State : రాజ్యము; రాష్ట్రము; ప్రభుత్వము
Tribe : తెగ; గణము; గుంపు

**RACY : రుచిగల; సరసమైన; అభిరుచి పుట్టించెడు; కారమైన**

*Synonyms* సమానార్థకములు

Flavorous : రుచిగల; రుచికలుగజేసెడు
Forcible : బలమైన; దృఢమైన; సమర్థమైన
Lively : ఉల్లాసముగల; ఉత్సాహజనకమైన
Piquant : తీక్ష్ణమైన; కారమైన; రుచిపుట్టించెడు
Poignaat : తీక్ష్ణమైన; బాధాకరమైన
Pungent : తీక్ష్ణమైన; కటువైన; తీవ్రమైన; పరుషమైన
Rich : సమృద్ధమైన; సారవంతమైన; సంపన్నమైన
Spicy : వాసనద్రవ్యసంబంధపు; రుచిగల
Spirited : చురుకైన; ఉల్లాసముగల; హెచ్చరికగల; ధైర్యముగల; వీర్యవంతమైన

*Antonyms* వ్యతిరేకార్థకములు

Cold : ఉదాసీనమైన; చల్లని; ప్రేమరహితమైన
Dull : అలసమైన; జడమైన; కాంతిహీనమైన
Flat : చప్పని; రసహీనమైన, వాడిలేని
Flavorless : రుచిలేని, సారహీనమైన
Insipid : నిస్సారమైన: చప్పని
Prosy : నీరసమైన; వచనముగానుండెడు
Stale : చప్పని; పాతబడిన
Stupid : తెలివిమాలిన; మందబుద్ధియైన
Tasteless : రుచిలేని; చప్పని
Vapid : రక్తికట్టని; నిర్జీవమైన

**RADICAL : ఆదిమమైన; మౌలికమైన; మూలమైన**

*Synonyms* సమానార్థకములు

Basal : మూలమైన
Basic : మూలమైన; ఆధారమైన
Complete : సంపూర్ణమైన; సమానత్వముకల
Constitutional : చట్టబద్ధమైన; నియమవంతమైన; సహజమైన
Entire : యావత్తు; పూర్తియైన
Essential : ముఖ్యమైన; ప్రధానమైన

Extreme : మిక్కిలియైన; కడపటిదైన; అత్యంతమైన

Fundamental : ప్రధానమైన; ఆదిమ మూలమైన

Ingrained : మనసుకు బాగాపట్టిన; అస్థిగతమైన; పాతుకుపోయిన

Innate : నిసర్గమైన; సహజమైన

Native : సహజమైన; దేశీయమైన

Natural : నైజమైన; సహజమైన; స్వభావసిద్ధమైన

Organic : అవయవసంబంధమైన

Original : ప్రథమమైన; మూలమైన; ఆదిమమైన

Perfect : అనూనమైన; సంపూర్ణమైన; నిర్దుష్టమైన

Positive : నిశ్చయమైన; రూఢిగల; యథార్థమైన

Primitive : ప్రాక్తనమైన; అనాగరకమైన; సంస్కారహీనమైన

Thorough : సంపూర్ణమైన; నిండైన; లోపము లేని

Thoroughgoing : పరిపూర్ణమైన; ఆమూలమైన

Total : మొత్తమైన; వెరసియైన; సర్వమైన

Underlying : లోని; లోపలి; ప్రధానమైన; ముఖ్యమైన; ఆధారభూతమైన

*Antonyms* వ్యతిరేకార్థకములు

Conservative : సంప్రదాయబద్ధమైన; మార్పు అంగీకరింపని

Inadequate : చాలని; అపర్యాప్తమైన

Incomplete : అరగొరయగు; అసంపూర్తియగు

Moderate : మితమైన; యుక్తమైన; తగుమాత్రమైన; మధ్యమమైన

Palliative : మరుగుపర్చెడు; ఉపశాంతి చేయు: బాధతగ్గించెడు

Partial : పాక్షికమైన; అసంపూర్ణమైన

Slight : కొంచెమైన; చులకన అయిన

Superficial : మీది మీది; లోతులేని; సారములేని; అల్పమైన

Tentative : తాత్కాలికమైన; ప్రయోగాత్మకమైన; పరిశీలనార్హమైన

Trial : ప్రయత్నము చేసిన; పరీక్షకై చేసిన

**RARE : అరుదైన; దుర్లభమైన; అసాధారణమైన; అపూర్వమైన**

*Synonyms* సమానార్థకములు

Curious : విచిత్రమైన; వింతయైన; జిజ్ఞాసుడగు, అపురూపమైన

Extraordinary : అసాధారణమైన, అసామాన్యమైన; విపరీతమైన; విశేషమైన; అద్భుతమైన

Incomparable : సాటిలేని, నిరుపమానమైన, అతులమైన

Infrequent : అరుదైన; అపురూపమైన; తరచుకాని

Odd : వింతయైన, వికారమైన; అపూర్వమైన

Peculiar : విశిష్టమైన; ముఖ్యమైన, ప్రత్యేకమైన; విచిత్రమైన

Precious : విలువగల; అమూల్యమైన; మహార్ఘ్యమైన

Remarkable : అసాధారణమైన; ఆశ్చర్యకరమైన; గమనింపదగిన

Scarce : అరుదైన; విరివిగా దొరకని· దుర్లభమైన; అసమర్థమైన

Singular : అనుపమానమైన; విలక్షణమైన
Strange : క్రొత్తదైన; పరాయియైన
Uncommon : అసాధారణమైన; అసామాన్యమైన
Unique : నిరుపమానమైన; అద్వితీయమైన
Unparalleled : అసదృశమైన; అసమానమైన; అద్వితీయమైన; నిరుపమానమైన
Unprecedented : అభూతమైన, అపూర్వమైన
Unusual : అసాధారణమైన

*Antonyms* : See synonyms for GENERAL, NORMAL, USUAL

**RATIONAL : సహేతుకమైన; వివేకముగల; బుద్ధివిశిష్టమైన**

*Synonyms* సమానార్థకములు

Reasonable : సబబైన; తగిన; యుక్తి యుక్తమైన; న్యాయమైన

**REACH : చేరు; అందుకొను; పొందు**

*Synonyms* సమానార్థకములు

Arrive : వచ్చు; చేరు; వచ్చిచేరు
Attain : పొందు; సాధించు; సంపాదించు; చేరు; పడయు
Come (to) : వచ్చు; చేరు; ప్రవేశించు; సంభవించు; కలుగు; అగు
Enter : ప్రవేశించు; చొచ్చు
Gain : సంపాదించు; గడించు; గెలుచు; లాభముపొందు
Get (to) : పొందు; తెచ్చు; సంపాదించు; చేరు; పొందు
Land : దిగు; చిక్కుకొను

*Antonyms* వ్యతిరేకార్థకములు

Depart : ఎడబాయు; విడిచిపెట్టు; వెడలిపోవు; జవదాటు; అతిక్రమించు
Embark : పనిలోప్రవేశించు; ప్రారంభించు; మొదలిడు; పూనుకొను; ఎక్కు
Go : వెడలు; పోవు; నడచు
Go away : వెళ్లిపోవు
Leave : విడచు; వదలిపెట్టు; వెళ్లిపోవు
Set out : తరలు; బయలుదేరు
Start : బయలుదేరు; ప్రయాణమగు; ప్రారంభించు
Weigh anchor : లంగరుదించు

**REAL : వాస్తవమైన; యథార్థమైన; నిజమైన; అకృత్రిమమైన; అచ్చమైన**

*Synonyms* సమానార్థకములు

Actual : సరియైన; వాస్తవికమైన. యథార్థమైన
Authentic : ప్రామాణికమైన
Certain : రూఢమైన; నిక్కమైన; ఒకానొక; నిశ్చితమైన; ధ్రువమైన
Demonstrable : రుజువుపరచదగిన; రూఢిపరచదగిన
Developed : వికసించిన; ఎదిగిన
Essential : ముఖ్యమైన; ప్రధానమైన
Genuine : అచ్చమైన; శుద్ధమయిన· వాస్తవమైన; నిష్కళంకమైన; అకృత్రిమమైన
Positive : నిశ్చయమైన; రూఢియైన; యథార్థమైన; నిజమైన
Substantial : బలమైన; వాస్తవమైన; గట్టిదైన; ధృఢమైన; తగిన
True : నిజమైన; యథార్థమైన; వాస్తవమైన; సత్యమైన; అచ్చమైన

Unquestionable : నిరాక్షేపమైన; నిస్సందేహమైన
Veritable : యథార్థమైన; నిజమైన

*Antonyms* వ్యతిరేకార్థకములు

Conceived : ఊహింపబడిన; తలచిన; భావింపబడిన
Fabulous : కల్పితమైన; నమ్మరానిదైన
Fanciful : చిత్రమైన; వింతయైన
Feigned : కపటమగు; తెచ్చిపెట్టుకొన్న; అబద్ధపు; నటనయగు
Fictitious : కల్పితమైన; కృత్రిమమైన; అవాస్తవికమైన
Hypothetical : ఊహాయైన; ఊహింపబడిన
Illusory : మాయమైన; భ్రమకల్గించెడి
Imaginary : మానసికమైన; మనఃకల్పితమైన; వట్టి
Reported : వదంతియైన; వినికిడియైన
Supposed : అనుకొనబడిన; ఊహింపబడిన
Supposititious : వాస్తవముకాని; కల్పితమైన; కృత్రిమమైన
Theoretical : ఊహింపబడిన; కల్పనయైన
Unreal : అవాస్తవమైన
Un:rue : అసత్యమైన
Visionary : భావనాత్మకమైన; మిథ్యయైన

**REASON (noun) : యుక్తి; వలను; హేతువు; నిమిత్తము; జ్ఞానము**

*Synonyms* సమానార్థకములు

Account : గణన; ఘనత; వృత్తాంతము; లెక్క; ఎన్నిక
Aim : లక్ష్యము; గురి; సూటి; ప్రయోజనము
Argument : వాదము; తర్కము
Cause : నిమిత్తము; కారణము
Consideration : ఆలోచన; విచారణ; హేతువు ప్రతిఫలము
Design : కల్పన; నమూనా
End : ఉద్దేశము; ప్రయోజనము
Ground : హేతువు; ఆధారము
Motive : హేతువు; నిమిత్తము; ఇంగితము; ప్రేరేపణ; ఉద్దేశము
Object : ఉద్దేశము
Principle : నియమము; నీతిసూత్రము; ధర్మసిద్ధాంతము
Purpose : ఉద్దేశము; ప్రయోజనము; లక్ష్యము
Reasoning : తర్కించుట

**REASON (verb): వితర్కించు; వాదించు**

*Synonyms* సమానార్థకములు

Argue : వాదించు; తర్కించు; కారణము చూపి ఒప్పించు; రుజువుచేయు; నచ్చచెప్పు
Contend : వాదించు; స్పర్ధవహించు; కలహించు
Controvert : ఖండించు; కాదనివాదించు
Debate : చర్చించు
Demonstrate : రుజువుచేయు; ప్రత్యక్షపర్చు; నిరూపించు
Discuss : చర్చించు; తర్కించు
Dispute : ఎదురుచెప్పు; జగడమాడు; తగవుపడు
Establish : స్థాపించు, ప్రతిష్ఠించు; నెలకొల్పు
Prove : రుజువుచేయు; నిరూపించు; పరీక్షించు
Question : ప్రశ్నించు; విచారించు; అనుమానించు

Wrangle : పెనగులాడు; కలహించు

**REASONING : తర్కించుట; హేతు వాదము; అనుమానము; కారణములు**

*Synonyms* సమానార్థకములు

Argument : వాదము; తర్కము; మీమాంస; చర్చ; యుక్తి; ప్రమాణము; సాధనము
Argumentation : వాదము; తర్కము
Debate : చర్చ
Ratiocination : తర్కము, హేతువువల్ల ఉపపాదించుట

**REBELLIOUS : తిరుగబడెడు; లొంగని; అణచరాని**

*Synonyms* సమానార్థకములు

Contumacious : మొండియగు; విధేయముకాని; తిరుగబడెడు
Disobedient : అవిధేయమైన; లొంగని; ధిక్కరించెడు; చెప్పినట్లువినని
Insubordinate : అధికారమునకులొంగని అవిధేయమైన
Intractable : మూర్ఖమైన, దారికిరాని; మొండి శిఖండియైన
Mutinous : తిరుగుబాటు చేయుచున్న, ఎదిరించెడు; తిరుగబడెడు
Refractory : పెడసరపు; వామమగు; మొండియగు
Seditious : అధికారము లేక ప్రభుత్వము పై తిరుగబడెడు
Uncontrollable : అణచరాని; ఆపరాని; అడ్డగింపరాని
Ungovernable : అవిధేయమైన; దుర్ని గ్రహమైన; లొంగని, వశ్యము కాని
Unmanageable : లొంగదియ శక్యము కాని; సంబాళింప సాధ్యము కాని

*Antonyms* వ్యతిరేకార్థకములు

Compliant : అనువర్తించెడు; విధేయమైన చెప్పినమాట వినెడు
Controllable : అదుపులోనుండెడు; అధీన ములోనుండెడు
Deferential : విధేయమైన; లోబడిన; నమ్రతగల
Docile : విధేయమైన; స్వాధీనమైన
Dutiful : ధర్మపరాయణమైన; విధేయ మైన
Gentle : సౌమ్యమైన, సాధువైన, సరసమైన
Manageable : సాధ్యమైన; నిభాయింప దగిన, లొంగదీయదగిన
Obedient : విధేయమైన; అడకువగల
Submissive : అణకువగల; నమ్రమైన
Subservient : ఉపయుక్తమైన, సహాయ కరమైన
Tractable : స్వాధీనమగు; విధేయమగు; దారికి వచ్చెడు
Yielding : మెత్తని; సులభముగా నమ్మ తించెడు

**RECORD : లిఖితము; దస్తావేజు; పత్రము; జ్ఞాపకార్థము వ్రాయబడిన గ్రంథము**

*Synonyms* సమానార్థకములు

Account : గణన; ఘనత; హేతువు; లెక్క; వృత్తాంతము
Archive : కవిలె; ప్రాచీనరచనలు
Catalog (ue) : జాబితా; వివరణ పట్టీ
Chronicle : వంశాను చరిత్రము; చరిత్ర
Document : పత్రము; మూలపత్రము; దస్తావేజు

**Enrolment** : ప్రవేశము; చేరిక; పట్టీ కెక్కుట; దాఖలగుట
**Entry** : ప్రవేశము; పద్దు
**Enumeration** : పరిగణనము; ఎంపిక; ఏకరువు
**History** : చరిత్ర; ఇతిహాసము
**Inscription** : శిలాశాసనము; తామ్ర శాసనము; బిరుదు
**Instrument** : అధికార పత్రము; శాసనము; ఉపకరణము
**Inventory** : జాబితా; పట్టీ
**Memorandum** : జ్ఞాపకార్థము వ్రాసి ఉంచిన గుర్తు; యాదాస్తు; వివరణ పత్రిక; విజ్ఞప్తి పత్రము
**Memorial** : జ్ఞాపక చిహ్నము; అర్జీ; విన్నపము
**Muniment** : దస్తావేజు మొ. ప్రమాణము
**Register** : పట్టీ; పట్టీ పుస్తకము; జాబితా
**Roll** : పట్టీ; జాబితా
**Schedule** : పట్టీ; సూచిక; సూచి
**Scroll** : పట్టీ; కాగితపు చుట్ట
**Story** : కథ; చరిత్ర; ఆఖ్యానము; కల్పితము

**RECOVER : స్వస్థత చెందు; రాబట్టుకొను; మరల పొందు**

*Synonyms* సమానార్థకములు

**Cure** : చికిత్సచేయు; బాగుచేయు; స్వస్థపరచు
**Heal** : మాన్పు; కుదుర్చు; స్వస్థపర్చు
**Reanimate** : తిరిగి జీవమిచ్చు; బ్రతికించు; ధైర్యము కలుగజేయు
**Recruit** : పోయిన బలమును పొందు; తిరిగి ఆరోగ్యమును శక్తిని పొందు



**Recuperate** : తిరిగి పొందు; మరల సంపాదించు; తిరిగి ఆరోగ్యము పొందు
**Regain** : తిరిగి సంపాదించు; మరల పొందు; తిరిగి స్వాధీనపర్చుకొను
**Repossess** : తిరిగి స్వాధీనము చేసికొను; తిరిగి పొందు
**Restore** : పూర్వస్థితికి తెచ్చు; తిరిగి ఇచ్చు; తిరిగి కలుగజేయు
**Resume** : మరల ఆరంభించు; తిరిగి తీసికొను
**Retrieve** : మరల సంపాదించు; తిరిగి తెచ్చుకొను

*Antonyms* వ్యతిరేకార్థకములు

**Die** : మరణించు
**Fail** : తప్పిపోవు; ఓడిపోవు
**Grow worse** : ఇంకను క్షీణమగు
**Relapse** : తిరుగబెట్టు; మరలపూర్వస్థితిలోపడు; మొదటిగుణము తిరిగివచ్చు
**Sink** : మునుగు; క్రుంగు; దిగు; ఇంకు

**REFINEMENT : నాగరకత; సరసత; నాజూకు**

*Synonyms* సమానార్థకములు

**Breeding** : శిక్ష; తర్బీదు; శీలము; నడవడి
**Civilisation** : నాగరకత
**Cultivation** : నాగరకత; సాగుబడి; కృషి
**Culture** : సంస్కృతి; సౌజన్యము; కృషి
**Elegance** : సరసత్వము; సొగసుతనము; పొలుపు
**Poise** : సమభావము. సరితూకము; సమత్వము
**Politeness** : మర్యాద; సభ్యత; దాక్షిణ్యము

Urbanity : నాగరకత; సరసత్వము

*Antonyms* వ్యతిరేకార్థకములు

Barbarism : మొరటుదనము; కిరాతకత్వము; పశుత్వము
Boorishness : మోటుదనము; నాగరకత లేమి; మర్యాదలేమి
Brutality : క్రౌర్యము; పశుత్వము
Clownishness : అసభ్యత; చతురతలేమి; హాస్యపాత్రత
Coarseness : ముతుకతనము; ఔరసు; మోటుదనము
Grossness : కసటు; జడత్వము; మోటుతనము
Rudeness : అవినయము; మోటుతనము;
Rusticity : అనాగరకత; మోటుతనము; అశిష్టత; అసభ్యత
Savagery : మృగత్వము; ఆటవికత్వము; క్రూరత్వము
Vulgarity : అసభ్యత; గ్రామ్యత; నైచ్యము

**REFUTE : పూర్వపక్షముచేయు; ఖండించు**

*Synonyms* సమానార్థకములు

Confute : తప్పుఅని ఖండించి నిరూపించు
Controvert : కాదనివాదించు; తర్కించు
Disprove : అసత్యమని నిరూపించు
Rebut : ప్రతివాదముచేయు; నిరాకరించు
Repel : తరిమివేయు; త్రోసిపుచ్చు; నిగ్రహించు; వెనుకకునెట్టు

**RELIABLE : విశ్వసనీయమైన; నమ్మదగిన**

*Synonyms* సమానార్థకములు

Dependable : ఆధారపడదగిన; నమ్మదగిన
Tried : వాడిచూచిన; నమ్మదగిన
Trustworthy : } విశ్వసనీయమైన; నమ్మదగిన
Trusty : }

**RELIGION : మతము; దైవభక్తి**

*Synonyms* సమానార్థకములు

Church : క్రైస్తవులసంఘము; క్రైస్తవుల గుడి
Communion : సంసర్గము; క్రైస్తవులలో దైవప్రసాదమనునది
Creed : మతము; విశ్వాసము
Cult : మతాచరణపద్ధతి; ఉపాసన; ఆచారక్రమము, పూజాపద్ధతి
Denomination : సంజ్ఞ; వ్యపదేశము; తరగతి, రకము
Faith : భక్తి; విశ్వాసము; ఆస్తిక్యము; నమ్మకము
Persuasion : బోధన; నమ్మతింపజేయుట
Sect : మతశాఖ
Theology : వేదాంత శాస్త్రము

*Antonyms* వ్యతిరేకార్థకములు

Atheism : నాస్తికత్వము
Blasphemy : దైవదూషణ; దూషణ
Godlessness : నాస్తికత్వము; పాపాచరణము
Impiety : దైవభక్తిరాహిత్యము; ద్రోహము; అపచారము
Irreligion : దేవనింద; నాస్తికత్వము; దైవభక్తిలేమి
Profanity : అపవిత్రత; మత దూషణము
Sacrilege : భగవద్దూషణ; దైవద్రోహము; దైవస్వాపహరణము
Unbelief : అపనమ్మకము; నాస్తికత్వము
Ungodliness : దైవభక్తిలేమి; పాపము
Wickedness : దుర్జనత్వము; దుష్టతనము

**RELUCTANT** : **ఇష్టములేని; సంకోచించెడు**

*Synonyms* సమానార్థకములు

Averse : విముఖమైన; ప్రతికూలమైన; ఇష్టములేని
Backward : మందబుద్ధిగల; ఇష్టములేని; వెనుకబడిన; చురుకుదనము లేని
Disinclined : మనసువిరిగిన; ఇష్టము లేని
Indisposed : ఇష్టము లేని; సమ్మతి లేని
Loath : రోతగల; అసహ్యపడెడు
Opposed : విరుద్ధమయిన; ప్రతికూలమైన
Slow : చురుకుతనము లేని; మెల్లని; మందమైన
Unwilling : ఇష్టము లేని; సమ్మతి లేని

*Antonyms* వ్యతిరేకార్థకములు

Desirous : కోరికగల; అపేక్షగల; వాంఛగల
Disposed : ఇష్టముగల; మనసు వచ్చిన
Eager : ఆతురముగల; వేడుకపడెడు
Favorable : ప్రసన్నమైన; సుముఖమైన; అనుకూలమైన
Inclined : ఇష్టముగల; మొగ్గు చూపెడు
Willing : సమ్మతించెడు; ఇష్టముగల

**REMARK** : **విశేషముగా ఎత్తి చెప్పబడినది; గమనింప దగిన వాక్యము; షరా**

*Synonyms* సమానార్థకములు

Annotation : వ్యాఖ్య; టీక
Comment : వ్యాఖ్య; విమర్శ
Note : గుర్తు; టీక; చీటి; యాదాస్తు; చిన్న జాబు
Observation : అభిప్రాయము; పరిశీలనము

Utterance : వచస్సు; ఉచ్చారణ; పలుకు

**REND** : **చీల్చు; చించు**

*Synonyms* సమానార్థకములు

Break : పగులగొట్టు; విరుగగొట్టు; విరుగు; పగులు
Burst : విచ్చు; ప్రేలు; అవియు; పగులు
Cleave : చీల్చు; విదారించు; ప్రక్కలించు; చీలు; పగులు
Divide : వేరుచేయు; భాగించు, విభజించు
Lacerate : గీచు; చించు; గాయముచేయు
Mangle : కొరుకు; కోయు; చీల్చివేయు; ధ్వంసముచేయు
Rip : చీల్చు; చింపు; కోయు
Rive : చీల్చు; బద్దలుచేయు
Rupture : పగులగొట్టు; విరుగగొట్టు; చించు; బద్దలుచేయు
Sever : తెగత్రెంచు; ఉత్తరించు; ఖండించు; విడదీయు
Slit : నిడివిగాచీల్చు; కోయు
Split : చీల్చు; ప్రక్కలించు
Sunder : విభాగించు; విడదీయు; ఖండించు
Tear : విచారించు; చీల్చు; విచ్ఛిన్నము చేయు; పడగొట్టు

*Antonyms* వ్యతిరేకార్థకములు

Heal : మాన్పు; కుదుర్చు; స్వస్థపర్చు
Join : జోడించు; కూర్చు; కలుపు; కలియు; అదుకు
Mend : బాగుచేయు; దిద్దు; చక్కజేయు
Reunite : మరలకలుపు; పునస్సంధానించు
Secure : భద్రముచేయు; సంపాదించు; జతపర్చు; చిక్కించుకొను
Sew : కుట్టు; చేర్చికుట్టు
Solder : టంకము వేయు; అతికించు

**Stitch** : కుట్టు
**Unite** : కలుపు; ఏకముచేయు; జోడించు; సంధించు
**Weld** : అతుకుపెట్టు; అతికించు

**RENOUNCE** : వదలుకొను; పరిత్యజించు

*Synonyms* సమానార్థకములు

**Abandon** : విసర్జించు; వదలుకొను; మానుకొను
**Abjure** : ఒట్టుపెట్టుకొని వదలుకొను; విడుచుటకు ప్రమాణముచేయు
**Deny** : నిరాకరించు; కాదను; లేదను; త్రోసిపుచ్చు; అంగీకరింపక పోవు
**Disavow** : తనదికాదను; ఒప్పుకొనక పోవు; అంగీకరింపకపోవు
**Discard** : పనికిమాలినదిగా ఎంచి విడనాడు; విడిచిపెట్టు; త్రోసివేయు
**Disclaim** : తనహక్కులువదలుకొను; తనకు సంబంధము లేదను; తనదికాదని విడచు
**Disown** : తనకు సంబంధములేదను; తనదికాదని నిరాకరించు
**Forswear** : ఒట్టుపెట్టుకొను; ఒట్టు వేసికొని లేదను; వ్యతిరేకముగా నడచు
**Recall** : స్మరించు; వెనుకకుపిలుచు: జ్ఞప్తికి తెచ్చు
**Recant** : పూర్వాభిప్రాయమును మార్చుకొంటినని చెప్పు; మాటతిరిగిపోవు
**Refuse** : నిరాకరించు; ఒల్లకపోవు
**Reject** : త్రోసిపుచ్చు; నిరాకరించు
**Repudiate** : ప్రత్యాఖ్యానించు; నిరాకరించు
**Retract** : వెనుకకు మరలు; వెనుకకులాగు
**Revoke** : కొట్టివేయు; రద్దుపర్చు; ఉపసంహరించు

*Antonyms* వ్యతిరేకార్థకములు

**Acknowledge** : ఒప్పుకొను; సమ్మతించు: సొంతహక్కు కావించుకొను; కృతజ్ఞతతో స్వీకరించు; అందినదని తెలియజేయు
**Adopt** : స్వీకరించు; అవలంబించు; దత్తత చేసికొను
**Assert** : నిశ్చితముగాపలుకు; ప్రమాణము చేయు
**Avow** : ఒప్పుకొను; ఖండితముగా చెప్పు; నొక్కిచెప్పు
**Cherish** : లాలించు; పెంచు; ఓము; కాపాడు; మనస్సులోపెట్టుకొను; ప్రేమించు
**Claim** : హక్కుకోసము వాదించు; తనదని వాదించు; రావలెననికోరు
**Defend** : ప్రతివాదముచేయు; కాపాడు; రక్షించు
**Hold** : పట్టుకొను; అణచిపెట్టు; ఆపు; అభిప్రాయపడు; తలచు; కలిగియుండు
**Maintain** : పోషించు; నిర్వహించు; కాపాడు; సమర్థించు; నిలుపు
**Own** : స్వాంతదారుడై యుండు; ఒప్పుకొను
**Proclaim** : ఘోషించు; చాటించు; ప్రకటించు; బహిరంగపరచు
**Uphold** : సమర్థించు; ఉద్ధరించు
**Vindicate** : నిర్దోషిత్వము నిరూపించు; నిజము సమర్థించు

**REPENTANCE** : పశ్చాత్తాపము

*Synonyms* సమానార్థకములు

**Attrition** : అనుతాపము; సంతాపము
**Compunction** : పరితాపము; వ్యాకులత; తప్పు చేసితినని విచారము

**Contrition** : పశ్చాత్తాపము; అనుతాపము
**Penitence** : పశ్చాత్తాపము; అనుతాపము
**Regret** : చింత
**Remorse** : పశ్చాత్తాపము
**Self-condemnation** : ఆత్మనింద
**Sorrow** : దుఃఖము; విచారము

*Antonyms* వ్యతిరేకార్థకములు

**Approval** : అనుమతి; మెచ్చుదల; మంజూరు
**Comfort** : హాయి; సుఖము; ఓదార్పు; ఊరట
**Complacency** : తృప్తి; సంతోషము
**Content** : తృప్తి
**Hardness** : గట్టితనము; కఠినత్వము; తీవ్రత్వము; క్రూరత్వము
**Impenitence** : అనుతాపము లేమి; పశ్చాత్తాపము లేమి
**Obduracy** : మొండిపట్టు
**Osbtinacy** : మొండితనము; మంకుతనము
**Self- approval** : తన్ను తానామోదించుకొనుట
**Self-complacency** : ఆత్మతుష్టి
**Self-congratulation** : తన్ను తానభినందించు కొనుట
**Stubbornness** : హఠము; మంకుతనము; మొండితనము

**REPORT** : **వృత్తాంతము; నివేదిక; వదంతి; వినికిడి**

*Synonyms* సమానార్థకములు

**Account** : గణన; వహీ; లెక్క; వృత్తాంతము; ఎన్నిక
**Chronicle** : వంశాను చరితము; చరిత్ర
**Description** : వర్ణన; వివరణము; కథనము; జాతి; రకము
**Narration** : కథనము
**Narrative** : కథా కథనము; వృత్తాంత వివరణము
**Recital** : పఠనము; కథనము
**Record** : లిఖితము; దస్తావేజు; పత్రము; జ్ఞాపకార్థము వ్రాయబడిన గ్రంథము
**Rehearsal** : చదువుట; పఠనము; తిరిగి చెప్పుట
**Relation** : కథనము; వావి; సంబంధము
**Rumor** : కింవదంతి; గాలిమాట; ప్రవాదము
**Statement** : ప్రకటనము; కథనము; వాఙ్మూలము; వివరింపబడినది; చెప్పబడినది
**Story** : కథ; చరిత్ర; ఆఖ్యానము; కల్పితము
**Tale** : కథ; వృత్తాంతము; కొండెము; చాడీలు
**Version** : కథనము; వ్యాఖ్యానము; గ్రంథపాఠము; అనువాదము; వివరణము

**REPROOF** : **చీవాట్లు; నింద; తిరస్కారము**

*Synonyms* సమానార్థకములు

**Admonition** : మందలింపు; హెచ్చరిక
**Animadversion** : దోషారోపణము; విశ్వాస రాహిత్యము
**Blame** : నింద; నీలాపనింద
**Censure** : అధిక్షేపణ, అభిశంసన; గర్హణ; దూషణ; నింద
**Check** : అదుపు, అభ్యంతరము; ఆటంకము; నిగ్రహము
**Chiding** : ఎత్తిపొడుపు, చీకొట్టుట; తిట్టుట; చీవాట్లు పెట్టుట
**Comment** : వ్యాఖ్య; విమర్శ; టీక

**Condemnation** : అధిక్షేపణ; ఖండన; నింద; దూషణ; శిక్షను విధించుట
**Criticism** : విమర్శ; ఆక్షేపణ
**Denunciation** : తప్పులు బయట పెట్టుట; బహిరంగముగా విమర్శించుట; ఖండించుట; నిందించుట
**Disapproval** : ఆక్షేపణ; అసమ్మతి; అనంగీకారము
**Objurgation** : దూషణ; చీవాట్లు పెట్టుట
**Rebuke** : మందలింపు; తిరస్కారము
**Reflection** : చింతనము; ఆలోచన; తలపోత
**Reprehension** : బుద్ధిచెప్పుట; గద్దింపు; మందలింపు
**Reprimand** : చీవాట్లు పెట్టుట; మందలింపు
**Reproach** : ఉపాలంభము; దూషణ; దుఃఖాతిరేకముతో తిట్టు
**Reproval** : కోపగింపు; చీకొట్టుట; గద్దింపు
**Upbraiding** : దూషణము; తిట్టు

*Antonyms* వ్యతిరేకార్థకములు

**Applause** : శ్లాఘన; మెప్పు; ప్రశంస; సంస్తుతి
**Approbation** : మంజూరు; సమ్మతి; ఒప్పుదల; అంగీకారము
**Approval** : అంగీకారము; అనుమతి; సమ్మతి; మెప్పుదల
**Commendation** : శ్లాఘన; స్తుతి; మెచ్చుకోలు; పొగడిక
**Encomium** : స్తుతి; పొగడ్త; శ్లాఘన
**Eulogy** : స్తుతి; అగ్గింపు; స్తవము
**Panegyric** : స్తోత్రము; స్తవము
**Praise** : సన్నుతి; ప్రశంస; పొగడ్త

**REPROVE** : **కోపగించు; మందలించు; చీకొట్టు**

*Synonyms* సమానార్థకములు

**Admonish** : మందలించు; గద్దించు; హెచ్చరించు
**Blame** : నిందించు
**Censure** : అభిశంసించు; అధిక్షేపించు; గర్హించు; దూషించు
**Chasten** : సంస్కరించు; బాగుచేయు; శిక్షించు; దండించు; సరిదిద్దు
**Check** : అదుపులో పెట్టు; నిగ్రహించు; ఆటంకపరచు
**Chide** : ఎత్తిపొడుచు; చీకొట్టు; తిట్టు
**Condemn** : అధిక్షేపించు; ఖండించు; శిక్షించు; తృణీకరించు
**Expostulate with** : హేతువు చూపి వాదించి అభిప్రాయము మార్చు
**Rebuke** : మందలించు; చీవాట్లు పెట్టు
**Remonstrate with** : కూడదని వాదించు; ఆక్షేపించు
**Reprehend** : మందలించు; బుద్ధిచెప్పు
**Reprimand** : చీవాట్లు పెట్టు; మందలించు
**Reproach** : ఉపాలంభించు; ఎగ్గాడు; దూషించు
**Take to task** : శిక్షించు; చీవాట్లుపెట్టు; గద్దించు; కోపించు
**Upbraid** : దూషించు; తిట్టు
**Warn** : హెచ్చరించు; సొసాయించు

*Antonyms* వ్యతిరేకార్థకములు

**Abet** : మద్దతుఇచ్చు; చెడ్డపనిలో సాయపడు
**Applaud** : శ్లాఘించు; కొనియాడు; సంస్తుతించు

**Approve** : అంగీకరించు; అనుమతించు; సమ్మతించు
**Cheer** : ఉల్లాసపరచు; జయపెట్టు; ధైర్య మిచ్చు
**Countenance** : అంగీకరించు; ఒప్పుకొను
**Encourage** : ప్రోత్సహించు; బరవసము చేయు ధైర్యము హెచ్చించు
**Impel** : ప్రేరేపించు; ముందరికి త్రోయు; నెట్టు
**Incite** : పురిగొల్పు; రెచ్చగొట్టు; ఉసి గొల్పు; ఎక్కులుపెట్టు
**Instigate** : ఎసగొల్పు; ఎగచు; దుర్బోధన చేయు
**Urge on** : బలవంతముచేయు; ప్రోద్బలము చేయు; ప్రేరణచేయు

**REQUITE : ప్రతీకారముచేయు; మారు చేయు; శాస్తిచేయు; చెల్లుచేయు; బాకీ చెల్లించు**

*Synonyms* సమానార్థకములు

**Avenge** : పగ తీర్చుకొను; కసితీర్చుకొను
**Compensate** : నష్టపరిహారమిచ్చు; నష్టము పూరించు
**Pay** : చెల్లించు; తీర్చు
**Pay off** : పరిష్కరించుకొను
**Punish** : శిక్షించు; దండించు
**Quit** : విడిచిపోవు; వదలిపోవు
**Reciprocate** : పరస్పరముగా జరుగు; ఇచ్చి పుచ్చుకొను
**Recompense** : ప్రతిఫలమిచ్చు; చెల్లించు; నష్టపరిహారమిచ్చు; బహుమానమిచ్చు; తిరిగి చెల్లించివేయు
**Remunerate** : ప్రతిఫలమిచ్చు; పసదన మిచ్చు
**Repay** : ఋణముతీర్చు; ప్రతిఫలమిచ్చు
**Retaliate** : ప్రతీకారముచేయు; కసితీర్చు కొను
**Return** : తిరిగి ఇచ్చు; తిరిగివచ్చు; వాపసు చేయు; తిరిగిపోవు, మళ్లు
**Revenge** : ప్రత్యపకారముచేయు; పగ తీర్చుకొను; కక్ష సాధించు
**Reward** : బహూకరించు; ప్రతిఫలమిచ్చు
**Satisfy** : తృప్తిపర్చు, సంతోషపెట్టు; మెప్పించు; సందేహనివృత్తి చేయు
**Settle with** : పరిష్కరించు; పొందుపరచు; తీర్చు; నిలుపు; నిశ్చయించు

*Antonyms* వ్యతిరేకార్థకములు

**Adsolve** : వదలిపెట్టు; విముక్తిచేయు; పాపపరిహారము చేయించు
**Acquit** : నిర్దోషియని తీర్మానించు; వదలిపెట్టు
**Excuse** : క్షమించు; మన్నించు; విడిచిపెట్టు
**Forget** : మరచిపోవు; పరాకుపడు; ఉపేక్షించు
**Forgive** : క్షమించు; సైరించు
**Neglect** : గీటునబుచ్చు; నిరాదరించు; ఒప్పరికించు; ఉపేక్షించు; అశ్రద్ధచేయు; త్రోసిరాజుచేయు
**Overlook** : ఉపేక్షించు; పరాకుపడు; కను పెట్టకపోవు
**Pardon** : క్షమించు; సైచు; మన్నించు
**Pass over** : దాటుట; ఉపేక్షించుట; ఆవల వైపునకు పోవుట
**Slight** : చులుకనచేయు; తృణీకరించు; అగౌరవము చేయు; నిర్లక్ష్యముచేయు

**RESPONSIBLE : జవాబుదారియైన; బాధ్యతగల; పూచీగల; ఉత్తరవాది యైన**

*Synonyms* సమానార్థకములు

Accountabe : బాధ్యత వహించ వలసిన
Amenable : విధేయతగల; స్వాధీనమైన; లొంగదీయబడిన
Answerable : జవాబు చెప్పవలసిన; పూచీగల; ఉత్తరవాదియైన
Liable : ఆస్పదమైన; జవాబుదారిగల; అర్హమైన; బాధ్యుడైన

*Antonyms* వ్యతిరేకార్థకములు

Absolute : కేవలమైన; శుద్ధమైన; అనన్య సంబద్ధమైన; సర్వస్వతంత్రమైన; నిరంకుశమైన
Arbitrary : కట్టుబాటులేని; నిరంకుశమైన; యుక్తిరహితమైన; హేతు బద్ధముకాని; స్వచ్ఛందమైన
Free : స్వతంత్రమైన; ధారాళమైన; ఉదారమైన; ప్రకామమైన; స్వచ్ఛందమైన
Irresponsible : బాధ్యత వహింపని; పూచిలేని; నమ్మరాని
Lawless : చట్టవిరుద్ధమైన; కట్టుబాటు లేని
Supreme : పరమమైన; అత్యుత్తమమైన; అతిశ్రేష్ఠమైన
Unconditioned : అనియతమైన; అవస్థాపితమైన; అప్రతిబద్ధమైన
Uncontrolled : అనిరుద్ధమైన; అటంకము లేని; వశ్యముకాని
Unfettered : సంకెళ్లులేని; అడ్డులేని; స్వేచ్ఛగల
Unlimited : పరిమితిలేని; అపారమైన; అమితమైన
Unrestrained : అడ్డములేని; నిర్బంధము లేని

**REST : విశ్రాంతి; ఎడతెరపి; నెమ్మది; ఆధారము; విరామము; శేషము**

*Synonyms* సమానార్థకములు

Calm : ప్రశాంతత; నెమ్మది
Calmness : శమము; శాంతి; నిశ్చలత్వము
Comfort : హాయి; సుఖము; ఓదార్పు; ఊరట; వసతి
Ease : సుఖము; గోము; నిమ్మళము; సౌలభ్యము; నెమ్మది
Leisure : తీరిక; తీరుబడి; ఉబుసు; విశ్రాంతి; సావకాశము; వెసులుబాటు
Peace : శాంతి; నెమ్మది; సంధి
Peacefulness : ప్రశాంతత
Quiet : క్షేమము; సుఖము; నిశ్చలత; ప్రశాంతత
Quietness : నిశ్చలత్వము
Relaxation : సడలింపు; విశ్రాంతి; వినోదము
Repose : విశ్రమించుట; శయనించుట; నెమ్మదించుట
Stillness : నిశ్శబ్దత
Tranquility : ప్రశాంతి; నెమ్మది

*Antonyms* వ్యతిరేకార్థకములు

Agitation : సంక్షోభము; వ్యాకులత; తల్లడపాటు; ఆందోళన
Commotion : అల్లరి; కలగుండు; రద్దీ; సంక్షోభము; కలవరము; అలజడి
Disquiet : ఉత్తలపాటు; కలత; చింత; అశాంతి; వ్యాకులము
Disturbance : అల్లరి; ఉపహతి; వ్యథ; వ్యాకులత; అలజడి

**Excitement** : ఆవేగము; ఉద్వేగము; ఉద్రేకము; ప్రేరేపణ
**Motion** : చలనము; కదలిక; నడక
**Movement** : కదలిక; నడక; చలనము; ఉద్యమము; ఉద్రేకము; ఆందోళనము
**Restlessness** : విరామము లేమి; కలత పాటు; కలవరపాటు; నెమ్మది లేమి; స్వాస్థ్యము లేమి
**Rush** : సమ్మర్దము; త్రొక్కిడి; వేగము
**Stir** : అల్లరి; సద్దు; సంక్షోభము, సందడి
**Strain** : ప్రయాస; అతిశ్రమ
**Toil** : కష్టమైనపని; పాటు
**Tumult** : కోలాహలము; కలకలము
**Unrest** : కలవరము; చింత; వ్యాకులత
**Work** : పని; పాటు; వృత్తి; ఉద్యోగము

**RESTIVE : ఇష్టము లేని; ముందుకు పోవ నిచ్చగింపని; మొండియైన**

*Synonyms* సమానార్థకములు

**Balky** : ఆటంకముగానున్న; అడ్డుగానున్న
**Fidgety** : శాంతిలేక తిరిగెడు; ఆరాట పడెడు
**Fractious** : శీఘ్రముగా కోపము వచ్చెడు; దురాగ్రహమైన; కలహాశీలమైన
**Fretful** : కోపపడెడు; చిరచిర లాడెడు
**Frisky** : గెంతెడు; త్రుళ్లిపడెడు· ఉల్లాసముగా ఉన్న
**Impatient** : సహనము లేని; తొందర గల; తాళలేని; ఓర్పులేని
**Intractable** : లొంగని; వశముకాని; మూర్ఖమైన; చెప్పిన వినని
**Mulish** : మూర్ఖుడైన; కంచరగాడిద వంటి
**Mutinous** : ఎదిరించెడు; తిరుగుబాటు చేసెడు; తిరుగబడెడు
**Obstinate** : హఠముగల; మొండియైన; మూర్ఖపు పట్టుదలగల; పంతగొండియైన
**Rebellious** : తిరుగబడెడు; లొంగని; అణచరాని
**Recalcitrant** : తన్ని వేసెడు; అనిష్టము చూపెడు; తిరుగుబాటు చేసెడు
**Refractory** : లొంగని; అవిధేయమైన; పెడసరమైన; మూర్ఖమైన; మొండియైన
**Resentful** : సులభముగా కోపించెడు; రోషముగల
**Restless** : విరామము లేని; నెమ్మది లేని; వ్యాకులమైన; కలతచెందిన
**Skittish** : చపలమైన; బెదరెడు
**Stubborn** : మొండియైన; మంకుతనపు; మూర్ఖపుపట్టుదలగల; లొంగని
**Unruly** : లొంగని; అవిధేయమైన; అణగని
**Vicious** : దుష్టమైన; దుర్మార్గమైన; చెడ్డయైన

*Antonyms* వ్యతిరేకార్థకములు

**Docile** : స్వాధీనమైన; విధేయమైన; వినయముగల; లొంగెడు
**Gentle** : నాజూకైన; సుకుమారమైన; సాధువైన; మర్యాదగల
**Manageable** : సాధ్యమైన; నిభాయించదగిన; లొంగదీయదగిన
**Obedient** : విధేయతగల; అడకువగల
**Passive** : ఊరకయున్న; తాలిమిగల; ఉదాసీనమైన
**Peaceable** : సాధువైన; కలహావిముఖుడైన
**Quiet** : నిశ్చలమైన; సాధువైన; నిశ్శబ్దమైన; శాంతమైన
**Submissive** : అణకువగల; నమ్రమైన;
**Tractable** : స్వాధీనమైన; విధేయమైన; చెప్పినట్లు వినెడు

Yielding : లొంగిపోయెడు; విడిచి పెట్టెడు

**RESTRAIN : అదుపులోనుంచు; నిగ్రహించు; ఆపు; నిరోధించు; నిర్బంధించు**

*Synonyms* సమానార్థకములు

Abridge : సంగ్రహపర్చు; కుదించు; తగ్గించు; కుదించు; సంక్షేపించు
Arrest : నిలుపు; అడ్డగించు; పట్టుకొను; నిర్బంధించు
Bridle : కళ్లెము వేయు, లొంగదీయు; అణచు
Check : వారించు; ఆటంకపర్చు; అణచు; సరిచూచు
Circumscribe : గిరిగీయు; సరిహద్దు ఏర్పరచు; చుట్టును గీతగీయు
Confine : చెరలోనుంచు; హద్దులో ఉంచు; బంధించు
Constrain : నిర్బంధించు; బలవంతము చేయు
Curb : అణచు; లొంగదీయు; అదుపులో పెట్టు; కుంచించు
Hinder : అడ్డగించు; ఆటంకపర్చు
Hold : నిలుపు; ఆపు; అణచు; పట్టుకొను; అభిప్రాయపడు
Hold back : నివారించు: ఆపి ఉంచు
Hold in : ఆగుట; అణచుట
Keep : ఉంచు; నిలుపు; కాపాడు; పోషించు
Keep back : దాచు; మరుగుపర్చు
Keep down : అణచి ఉంచు
Keep in : నిర్బంధించి యుంచు
Keep under : లొంగదీసి యుంచు; వశములోనుంచు
Repress : అణచు; అణగగొట్టు; నివారించు
Restrict : మేరదాటకుండ చేయు; కట్టుబాటులో ఉంచు; నిర్బంధించు
Suppress : అణచు; ఆపు; నిగ్రహించు; దాచు; మరుగుపర్చు
Withhold : ఆపి ఉంచు; ఆగి ఉండు; నిలిపి ఉంచు; బిగబట్టు; ఈయకపోవు

*Antonyms* వ్యతిరేకార్థకములు

Aid : సాయము చేయు; ఉపకరించు
Animate : జీవము పోయు; ఉత్సాహము కల్గించు; ప్రేరేచు
Arouse : లేపు; నిద్రలేపు; మేల్కొలుపు; ప్రేరేచు
Emancipate : బంధ విమోచనము కలిగించు; ఉద్ధరించు; స్వేచ్ఛనిచ్చు; విడిపించు
Encourage : ప్రోత్సహించు; బరవసము చేయు
Excite : ఎసగొల్పు; పురిగొల్పు; రెచ్చగొట్టు; ఉద్రేకపర్చు; ఉద్రేకింప జేయు
Free : తొలగించు; విడిచిపెట్టు
Impel : ప్రేరేపించు
Incite : పురిగొల్పు; ఉసిగొల్పు; ఎక్కులు పెట్టు
Let loose : బంధవిముక్తి చేయు; పట్టు విడుచు
Release : విడిచిపుచ్చు; విడుదల చేయు
Set free : విడిపించు

**RETIREMENT : ఉద్యోగవిరమణము; అపసరణము; ఏకాంతస్థలము**

*Synonyms* సమానార్థకములు

Loneliness : ఒంటరిపాటు; ఏకాంతము
Privacy : మరుగు; గుట్టు; రహస్యము; గుప్తత

**Seclusion** : ఏకాంతవాసము; వివిక్తత; చాటు; ప్రత్యేకస్థలము
**Solitude** : ఏకాంతవాసము; ఏకాంత స్థలము
**Withdrawal** : ఉపసంహారణము; వాపసు తీసికొనుట

*Antonyms* *వ్యతిరేకార్థకములు*

**Association** : సాంగత్యము; పొత్తు; జట్టు; సహవాసము; సంగడి; సంఘము; జత
**Companionship** : తోడు; సహవాసము; సాంగత్యము
**Company** : సంఘము; జట్టు; మేళము; సార్థము; జంజాటము, పరిజనము
**Converse** : సంభాషణము; వ్యవహారము
**Fellowship** : సహవాసము; స్నేహము; సంగాతము; అధికార సభ్యత్వము
**Society** : సమాజము; సంఘము; ప్రజలు

**REVELATION : ఆవిర్భావము; అభివ్యక్తి; సత్యదర్శనము; ఆవిష్కరణము; బయటపడిన విషయము**

*Synonyms* *సమానార్థకములు*

**Apocalypse** : శ్రుతి; ఆవిష్కరణము; అవతరణిక; బైబిల్ కడపటి భాగము
**Disclosure** : రహస్యము వెలిపుచ్చుట; బహిరంగపర్చుట; బయటపెట్టుట
**Manifestation** : ప్రాదుర్భావము; అభివ్యక్తి; సాక్షాత్కారము; వెల్లడిఅగుట
**Prophecy** : పష్యము; జోస్యము; భవిష్యత్ కథనము; సోదె
**Vision** : దర్శనము; నిధ్యానము; భావన; దివ్యదృష్టి

*Antonyms* *వ్యతిరేకార్థకములు*

**Cloud** : మబ్బు; మేఘము; కళంకము; గుంపు
**Cloudiness** : మబ్బుగా నుండుట; మసకమసకగా నుండుట; మందారము
**Concealment** : గోపనము; మరుగు; దాపరికము; చాటు
**Hiding** : దాగుడు; మరుగు; మరుగుపర్చుట
**Mystery** : మర్మము; రహస్యము
**Obscuration** : మరుగుచేయుట; అగోచరత్వము
**Shrouding** : కప్పుట; గుప్తము చేయబడుట
**Veiling** : ముసుగువేయుట

**REVENGE : ప్రత్యపకారము; వైరనిర్యాతనము; కక్ష సాధించుట**

*Synonyms* *సమానార్థకములు*

**Avenging** : ప్రతీకారము; శాస్తి
**Hatred** : ద్వేషము; విరోధము; రోత: ఏవము
**Reprisal** : ప్రతీకారము; ప్రత్యపకారము
**Requital** : ప్రతిక్రియ; చెల్లు; బదులుగా చేయబడినది
**Retaliation** : ప్రతిక్రియ; ప్రతీకారము
**Retribution** : తప్పునకు తగిన; ప్రతిఫలము; కర్మఫలము; శిక్ష; కర్మపరిపాకము
**Vengeance** : ప్రత్యపకారము; పగ; కసి

*Antonyms* *వ్యతిరేకార్థకములు*

**Compassion** : కరుణ; అనుకంప; కనికరము; జాలి; పరితాపము
**Excuse** : క్షమాపణ
**Forgiveness** : సైరణ; క్షమ
**Grace** : అనుగ్రహము; కృప; మురువు; సింగారము

**Mercy** : కృప; కరుణ
**Pardon** : సైరణ; క్షమ
**Pity** : జాలి; కనికరము; అక్కటికము
**Reconciliation** : సమాధానము; సంధి

**REVOLUTION : విప్లవము; పరివర్తనము**

*Synonyms* సమానార్థకములు

**Anarchy** : అరాజకత; అనాయకత
**Confusion** : తికమక; కలవరపాటు; సంభ్రమము; గత్తర; తత్తరపాటు
**Disintegration** : ఛిన్నాభిన్నము; విడిపోవుట; శిథిలము; లయము; విభజనము
**Disorder** : క్రమరాహిత్యి; చిందరవందర; విటతాటము; తారుమారు; కలగుండు; ఋబ్బు; నలితి; క్రమభంగము
**Insubordination** : అవిధేయత; తిరుగుబాటు; అధికారికి లోబడకపోవుట; చెప్పినమాట వినకపోవుట
**Insurrection** : రాజునెదిరించుట; దాడి వెడలుట; తిరుగుబాటు
**Lawlessness** : న్యాయాతిక్రమము; నియమరాహిత్యము; చట్టవిరోధము
**Mutiny** : సైన్యపు తిరుగుబాటు
**Outbreak** : విజృంభణము; ఎద్దడి; బ్రద్దలగుట; అకస్మాత్తుగా కలుగుట
**Putsch** : తిరుగబడుటకుచేయుప్రయత్నము
**Rebellion** : పితూరి; తిరుగుబాటు
**Revolt** : తిరుగుబాటు; ఎదిరింపు
**Riot** : దొమ్మి; అల్లరి; కలత; కోలాహలము
**Sedition** : రాజద్రోహము; దేశద్రోహము; (అట్టి వ్రాతలు)
**Tumult** : అల్లకల్లోలము; కలకలము; అల్లరి
**Uprising** : తిరుగుబాటు

*Antonyms* వ్యతిరేకార్థకములు

**Authority** : అధికారము; ఆధిపత్యము; ప్రామాణ్యము
**Command** : అనుశాసనము; ఆజ్ఞ; ఉత్తరువు
**Control** : అదుపు; వశము; ఆజ్ఞ; హద్దు
**Domination** : సర్వాధికారము; ప్రాబల్యము
**Dominion** : అధినివేశము; రాజ్యము; రాష్ట్రము; దేశము; పరిపాలన
**Empire** : సామ్రాజ్యము
**Government** : ప్రభుత్వము· పరిపాలన; పలుబడి; రాచరికము
**Law** : శాసనము; చట్టము; స్మృతి; నియమము; విధి; సూత్రము
**Loyalty** : విశ్వాసము; రాజభక్తి
**Obedience** : విధేయత; అడకువ
**Order** : ఆజ్ఞ; ఉత్తరువు; క్రమము; జాతి
**Rule** : సూత్రము; కట్టడ; విధి; నిబంధనము; పరిపాలనము; ప్రభుత్వము
**Sovereignty** : ప్రభుత్వము; పలుబడి; రాజ్యము; అధికారము
**Submission** : వినతి; మనవి; నమ్రత; అడకువ
**Supremacy** : సర్వాధికారము; ఆధిక్యము

**REVOLVE : పరిభ్రమించు; చుట్టుతిరుగు**

*Synonyms* సమానార్థకములు

**Circle** : చుట్టుతిరుగు; చుట్టుకొను; పరివేష్టించు; పరిభ్రమించు

Gyrate : గిరగిరతిరుగు
Roll : దొర్లు; చక్రమువలె తిరుగు
Rotate : మరల మరల తిరుగు; గుండ్రముగా తిరుగు; గుండముగా త్రిప్పు; పరిభ్రమించు
Spin : త్రిప్పు; మెలివెట్టు; పేను
Turn : తిరుగు; త్రిప్పు; పరిభ్రమించు
Twirl : గిరగిరతిరుగు; సుడితిరుగు
Whirl : గిరగిరత్రిప్పు; సుడితిరుగు
Wind : చుట్టు చుట్టు; త్రిప్పు

**REWARD : బహుమతి; బహుమానము; ప్రతిఫలము**

*Synonyms* సమానార్థకములు

Amends : నష్టపూర్తి; పరిహారము
Award : తీర్పు; నిశ్చయము
Compensation : నష్టపరిహారము
Guerdon : బహుమానము
Meed : పారితోషికము
Prize : బహుమతి; కానుక
Recompense : ప్రతిఫలము; నష్టపరిహారము
Remuneration : వసదనము; ప్రతిఫలము; పారితోషికము
Reparation : నష్టపూర్తి; పరిహారము; చెల్లు
Requital : చెల్లు; ప్రతిక్రియ
Retribution : ప్రతిఫలము; కర్మఫలము; కర్మపరిపాకము
Satisfaction : తృప్తి; తనివి; పరితుష్టి

**RHYTHM : లయ; ఛందోనియతి**

*Synonyms* సమానార్థకములు

Cadence : స్వరము యొక్క మూర్ఛన; అవరోహణము
Euphony : శ్రావ్యత
Measure : సంగీతమున తాళకాలము; ఛందస్సున గణము
Meter : ఛందస్సు
Verse : శ్లోకము; పద్యము

**RIDDLE : కఠిన సమస్య; ప్రహేళిక; పొడుపుకథ**

*Synonyms* సమానార్థకములు

Conundrum : చిన్నప్రశ్న; శ్లేష; విపరీతార్థక వాక్యము
Enigma : విడికథ; గూఢవాక్యము; గూఢప్రశ్న
Mystery : మర్మము; నిగూఢత
Paradox : విపరీతార్థత; వైరుధ్యము; అసమ్మతార్థము
Problem : సమస్య; ప్రశ్న; సందిగ్ధ విషయము
Puzzle : చిక్కు; చిక్కుప్రశ్న; ప్రహేళిక

*Antonyms* వ్యతిరేకార్థకములు

Answer : సమాధానము; జవాబు; ప్రత్యుత్తరము
Axiom : స్వతః సిద్ధాంతము; స్వయం సిద్ధము, తత్త్వము
Explanation : వివరణము; సంజాయిషీ; స్పష్టీకరణము
Proposition : ప్రస్తావము
Solution : సమస్యాసమాధానము

**RIGHT (adj) : మంచిదైన; న్యాయమైన; సరియైన; తిన్నని; క్రమమైన; నిజమైన**

*Synonyms* సమానార్థకములు

Appropriate : ఉచితమైన; సంగతమైన

Correct : మంచిదైన; శుద్ధమైన; సరియైన
Direct : సూటియైన; సరళమైన; సరాసరియైన; తిన్నని
Equitable : న్యాయమైన; నిష్పక్షపాతమైన
Fair : స్వచ్ఛమైన; సుందరమైన; నిష్కళంకమైన; న్యాయమైన; అనుకూలమైన
Fitting : తగిన; యుక్తమైన; అనుకూలమైన
Good : మంచిదైన; యోగ్యమైన; ఉత్తమమైన; శ్రేష్ఠమైన
Honest : నీతిగల; నిజాయితీగల; ఆర్జవముగల
Just : న్యాయమైన; తగిన; సరియైన
Lawful : న్యాయమైన; ధర్మసమ్మతమైన; శాస్త్రోక్తమైన; విధ్యుక్తమైన
Perpendicular : నిట్టనిలువైన; నిలువుగానున్న; నిలిచియున్న
Proper : తగిన; సముచితమైన; యుక్తమైన; క్రమమైన
Rightful : న్యాయసమ్మతమైన; వాస్తవమైన; ధర్మసమ్మతమైన
Straight : సరళమైన; తిన్నవైన; ఋజువైన; అవక్రమైన
True : నిజమైన; యథార్థమైన; వాస్తవమైన; సత్యమైన; అచ్చమైన
Unswerving : చలింపని; దృఢమైన; నిర్భరమైన; నిబ్బరమైన
Upright : నీతిగల; న్యాయప్రవర్తనగల; సత్యవంతుడైన; నిలువుగా ఉన్న

*Antonyms* వ్యతిరేకార్థకములు

Bad : చెడ్డదైన; దుష్టమైన; పనికిమాలిన; ప్రతికూలమైన; పనికిరాని; సరికాని
Crooked : వక్రమైన; కుటిలమైన
Evil : దుష్టమైన; చెడుదైన
False : అలీకమైన· మిథ్యయైన; బూటకమైన; కృత్రిమమైన
Improper : అనుచితమైన; తగని; కూడని; అయోగ్యమైన
Incorrect : సరికాని; తప్పైన; నిజముకాని
Indirect : పరోక్షమైన; వక్రమైన; చుట్టయిన
Iniquitous : అన్యాయమైన; అక్రమమైన; పాపమైన
Unfair : న్యాయముకాని; న్యాయవిరుద్ధమైన; అన్యాయమైన; పక్షపాతమైన
Unjust : అన్యాయమైన
Unrighteous : అధర్మమైన; పాపమైన; దుర్మార్గమైన
Wrong ; అన్యాయమైన; అయుక్తమైన; సరికాని; తగని

**RIGHT (noun) : న్యాయము; క్రమము; సరి; నిజము; తప్పులు లేమి; అధికారము; స్వామ్యము; హక్కు**

*Synonyms* సమానార్థకములు

Birthright : జన్మహక్కు
Claim : హక్కు
Exemption : మినహాయింపు; పరిహారము; మన్నింపు
Franchise : పౌరాధికారము; ఎన్నుకొనే స్వాతంత్ర్యము; హక్కు
Immunity : విశేషాధికారము; రాహిత్యము
Liberty : స్వతంత్రత; స్వేచ్ఛ
License : అనుమతి
Perquisite : మామూళ్లు; ఉపరిలాభము
Prerogative : విశేషాధికారము; అధికర్యము; అసాధారణాధికారము

**Privilege** : ప్రత్యేకపు హక్కు; చనవు; బలిమి; ఆధిక్యము; స్వతంత్రత

**RISE** : **లేచు; ఉదయించు; ఉద్భవించు; వర్ధిల్లు**

*Synonyms* సమానార్థకములు

**Arise** : లేచు; సంభవించు; ఉదయించు; కలుగు, లేచి యెగురు
**Ascend** : ఎక్కు; ఆరోహించు
**Emanate** : కలుగు; పుట్టు
**Flow** : జాలువారు, ప్రవహించు; పారు
**Issue** : వెలువడు; జాలువారు
**Proceed** : సాగు, నడచు; జరుగు; కలుగు
**Spring** : దుముకు; ఉంకించు

*Antonyms* వ్యతిరేకార్థకములు

**Decline** : క్షీణించు; తీసిపోవు; నిరాకరించు; వాలు; ఒరగు; త్రోసివేయు
**Descend** : అవతరించు; అవరోహించు; దిగు; పైనివచ్చిపడు; వంశమున పుట్టు
**Drop** : జారు; పడు
**Fall** : పడు; కూలు; సంభవించు; క్షీణించు; తగ్గు; రాలు
**Go down** : క్రిందికి దిగు; పడు
**Set** : క్రుంకు; అస్తమించు
**Settle** : పరిష్కరించు; పొందుపరచు; తీర్చు; నిలుపు; నిశ్చయించు; శాంతింపజేయు; కుదురుపర్చు; చట్టపరుచు

**ROBBER** : **దొంగ**

*Synonyms* సమానార్థకములు

**Bandit** : బందిపోటు దొంగ
**Brigand** : తెరువాటుకాడు; దారులు కొట్టువాడు
**Buccaneer** : ఓడదొంగ
**Burglar** : కన్నగాడు; కన్నపుదొంగ
**Depredator** : దోపుడు దొంగ; కొల్లగొట్టువాడు
**Despoiler** : అపహర్త
**Footpad** : తెరువాటుకాడు
**Forager** : (భోజన పదార్థములను) దొంగిలించువాడు
**Freebooter** : కొల్లపెట్టువాడు; నౌకాచోరుడు
**Highwayman** : దారిదోపుడు దొంగ; తెరువాటుకాడు
**Maruuder** : దోపిడి దొంగ
**Pillager** : దోపుడు దొంగ
**Pirate** : ఓడదొంగ
**Plunderer** : కొల్లగాడు; దోపిడికాడు
**Raider** : దోపిడికాడు; దాడిచేయువాడు
**Thief** : దొంగ; చోరుడు

**ROYAL** : **రాజసంబంధమైన; ఉదారమైన**

*Synonyms* సమానార్థకములు

**August** : మహనీయమైన; భవ్యమైన
**Imperial** : సామ్రాజకమైన
**Kinglike** : రాజువంటి; రాజునకు తగిన
**Kingly** : రాజఠీవిగల; అతిఘనమైన
**Magnificent** : మహాఘనమైన; వైభవోపేతమైన; దివ్యమైన
**Majestic** : ఠీవిగల; ప్రాభవముగల
**Munificent** : వితరణశీలిఅయిన; ఉదారమైన
**Princely** : మహోదారమైన; రాజోచితమైన
**Regal** : రాజసంబంధమైన

*Antonyms* వ్యతిరేకార్థకములు

**Beggarly** : యాచకమైన; నీచమైన; క్షుద్రమైన; నికృష్టమైన; తుచ్ఛమైన
**Contemptible** : హేయమైన; తుచ్ఛమైన; నీచమైన
**Mean** : నీచమైన; తుచ్ఛమైన
**Poor** : పేదయైన; దరిద్రుడైన; దీనమైన; నిస్సారమైన
**Servile** : నీచమైన; గౌరవహీనమైన
**Slavish** : నీచమైన; బానిసబుద్ధిగల; క్షుద్రమైన
**Vile** : నీచమైన; ఖలుడైన; అపవిత్రమైన

**RUSTIC** : **మోటైన; అనాగరికమైన; అసంస్కారమైన**

*Synonyms* సమానార్థకములు

**Agricultural** : వ్యవసాయసంబంధమైన; వ్యావసాయకమైన
**Arcadian** : గ్రామసీమల స్వచ్ఛంద శోభతో కూడిన
**Artless** : నిష్కపటమైన; అమాయకమైన
**Awkward** : అకటవికటమైన; వికృతమైన; అరమ్యమైన
**Boorish** : మోటైన; నాగరికతలేని
**Bucolic** : గోపగోపికా సంబంధమైన; గ్రామీణమైన
**Clownish** : అసభ్యమైన; మోటైన; చతురతలేని
**Coarse** : ముతుకయగు; బెరసైన; మోటైన
**Countrified** : అనాగరకముగా కన్పట్టునట్లు చేయు
**Country** : పల్లెటూరు సంబంధమైన; నాటుఅయిన; అనాగరికముగ కన్పట్టు
**Hoydenish** : గయ్యాళిపిల్ల అయిన
**Inelegant** : విరసమైన; నాజూకులేని; సొగసులేని; మోటైన
**Outlandish** : అన్యదేశపు; విపరీతమైన; వికారమైన; వింతయైన
**Pastoral** : గ్రామీణమైన; మోటైన; గోపసంబంధమైన
**Plain** : సాదాయైన; తెల్లమైన; స్పష్టమైన
**Rude** : మోటయిన; మూర్ఖమైన; నాగరికతలేని; మర్యాదతెలియని
**Rural** : పల్లెటూరి సంబంధమయిన; నాటుఅయిన
**Sylvan** : వనసంబంధమైన; గ్రామీణమైన
**Uncouth** : వింతయైన; వికారమైన; అసహ్యమైన; మోటయిన
**Unpolished** : మోటైన, మెరుగులేని
**Unsophisticated** : వక్రముకాని; కుతర్కములేని
**Untaught** : నేర్పని, విద్యావిహీనమైన
**Verdant** : పచ్చని; పచ్చికసంబంధమైన

*Antonyms* వ్యతిరేకార్థకములు

**Accomplished** : కృతార్థుడైన; సిద్ధుడైన; ప్రవీణుడైన; విశారదుడైన; నిపుణుడైన
**Citylike** : నగరసంబంధమైన
**Cultured** : సంస్కృతికల
**Elegant** : సొగసైన; అందమైన; సరసమైన; మనోహరమైన
**Polished** : మెరుగుపెట్టబడిన; మోటుతనము పోయిన; తేజోవంతమైన
**Polite** : నాగరకతగల; మర్యాదగల; సభ్యతగల; సుశీలముగల
**Refined** : శుద్ధిచేయబడిన; నాగరకత పొందిన; నాజూకైన
**Urbane** : నాగరకతగల; మర్యాదగల

Well-bred : సుశిక్షితుడైన; సుశీలముగల; మర్యాదగల

**SACRAMENT : సంస్కారము; కర్మ**

*Synonyms* సమానార్థకములు

Ceremony : మతకార్యము; కర్మ; ఆచారము; ఆదరసత్కారము

Communion : సంసర్గము; కలయిక; సహవాసము; పరస్పర కథోపకథనము

Eucharist : క్రీస్తుమతములో మహాప్రసాద వినియోగము

Observance : ఆచారము; అనుష్ఠానము; అనుసరణము

Ordinance : విధి; శాసనము; ధర్మవిధి

Rite : కర్మ; మతకర్మ

Service : ఉపచారము; సేవ; పూజకెలసము

Solemnity : సంస్కారము; కర్మక్రియ

**SAD : దుఃఖితమైన; ఖిన్నమైన; విచారకరమైన**

*Synonyms* సమానార్థకములు

Afflicted : ఎరియింపబడిన; వ్యథపొందిన; నొప్పిపొందిన; దుఃఖపడిన

Dejected : చింతచేక్రుంగిన; చిన్నవోయిన; ఖిన్నుడైన; వ్యాకులుడైన

Depressed : భంగపడిన; డిందుపడిన, మనసు క్రుంగిన

Desolate : పాడైన; దిక్కులేని; నిర్మానుష్యమైన

Despondent : నిరాశచెందిన

Disconsolate : ఖిన్నుడైన; దుఃఖభరితుడైన

Dismal : భయంకరమైన; పాడైన; కళావిహీనమైన

Distressed : ఆపదపొందిన; ఆర్తిపొందిన; వ్యసనము పొందిన; క్లేశముపొందిన

Distressing : ఆపదపొందిన; ఆర్తిపొందిన; వ్యసనము పొందిన; క్లేశముపొందిన

Doleful : దుఃఖకరమైన

Downcast : చిన్నపోయిన; ఖిన్నమైన; తలవంచుకొనిన

Dreary : పాడైన; శూన్యమైన· భయంకరమైన; జావురుమనుచున్న; ఉద్వేజకమైన

Dull : అలసతగా ఉన్న; జడమైన; మందబుద్ధియైన; కాంతిహీనమైన

Gloomy : చింతామగ్నమైన; అప్రకాశమైన; అస్పష్టమైన; అగోచరమైన

Grave : గంభీరమైన; అనుపేక్షణీయమైన; డెప్పరమైన

Heavy : బరువైన, మందమైన, గురుత్వముగల

Lugubrious : ఏడ్చెడు; దుఃఖపడుచున్న; దుఃఖమును తెలిపెడు

Melancholy : విషణ్ణమైన; మనోవ్యాకులమైన; నిరుత్సాహమైన; ఖిన్నమైన

Miserable : శోచనీయమైన

Mournful : విలపించెడు; దుఃఖించెడు

Sober : ప్రమత్తతలేని; మత్తులేని; నెమ్మదిగల

Somber : మకమక లాడెడు; ప్రకాశములేని; మందముగా నున్న

Sorrowful : దుఃఖించు చున్న; వ్యసనపడుచున్న

Sorry : విచారముగల; దుఃఖముగల

Unhappy : విచారకరమైన; దుఃఖకరమైన; దురదృష్టకరమైన

Woebegone : విపన్నమైన; దుఃఖయైన

Woeful : దుఃఖముతో నిండియున్న; వ్యసనగ్రస్తమైన

*Antonyms* : See synonyms for HAPPY

**SAGACIOUS : వివేకముగల**

*Synonyms* సమానార్థకములు

**Able** : చాలిన; సమర్థవంతమైన
**Acute** : తీవ్రమైన; నిశితమైన
**Apt** : యుక్తమైన; తగిన; స్వభావముగల
**Clear-sighted** : స్పష్టముగా చూడగల; సూక్ష్మదృష్టిగల; వివేకశాలియైన
**Discerning** : తెలివిగల; వివేకశాలియైన; విచక్షణశీలమైన
**Intelligent** : తెలివిగల; బుద్ధిశాలియైన
**Judicious** : వివేకవంతమైన
**Keen** : నిశితమైన; వాడియైన; తీక్ష్ణమైన; తీవ్రమైన
**Keen-sighted** : నిశితముగా చూచెడు
**Keen-witted** : నిశితబుద్ధిగల
**Perspicacious** : సూక్ష్మదృష్టిగల: తీక్ష్ణదృష్టిగల
**Quick of scent** } పసికట్టకల
**Quick-scented** }
**Rational** : యుక్తియుక్తమైన; బుద్ధివిశిష్టమైన
**Sage** : జ్ఞానముతో కూడిన; బుద్ధిశాలియైన
**Sensible** : వివేకముగల బుద్ధిశాలియైన
**Sharp** : వాడియైన; నిశితమైన; తీక్ష్ణమైన
**Sharp-witted** : నిశితబుద్ధిగల
**Shrewd** : గడసరియైన; చతురమైన
**Wise** : తెలివిగల; వివేకముగల; జ్ఞానముగల

*Antonyms* వ్యతిరేకార్థకములు

**Absurd** : అసంగతమైన; అనుపపన్నమైన; అసంబద్ధమైన
**Dull** : అలసమైన; మందమైన; కాంతిహీనమైన; జడమైన
**Foolish** : బుద్ధిమాలిన
**Futile** : పనికిమాలిన; వ్యర్థమైన
**Ignorant** : తెలియని; ఎరుగని; జ్ఞానములేని
**Irrational** : తెలివిలేని; పశుప్రాయమైన
**Obtuse** : వాడిలేని; మొద్దుబారిన
**Senseless** : బుద్ధిహీనమైన; తెలివిమాలిన; అర్థరహితమైన; అచేతనమైన
**Silly** : చిలిపియైన; మూర్ఖమైన
**Simple** : ఉత్తదైన; అమిశ్రమైన; సరళమైన, సాధువైన; డాంబికము లేని
**Sottish** : త్రాగిమత్తెక్కిన
**Stupid** : బుద్ధిహీనముగు; ఈబరియైన
**Undiscerning** : వివేకములేని; తెలివిలేని
**Unintelligent** : తెలివిలేని; బుద్ధిలేని

**SAILOR : నావికుడు**

*Synonyms* సమానార్థకములు

**Bluejacket** : ప్రభుత్వ నౌకాదళమునకు చెందిన నావికుడు
**Marine** : ఓడసిపాయి
**Mariner** : నావికుడు
**Seafarer** : సముద్ర సంచారి
**Seafaring man** : నావికావృత్తికలవాడు
**Seaman** : నావికుడు
**Tar** : నావికుడు

**SALE : అమ్మకము; విక్రయము**

*Synonyms* సమానార్థకములు

**Bargain** : బేరము
**Barter** : వినిమయము; సాటా బేరము
**Change** : మార్పు; వికృతి

**Deal** : వర్తకము; పని; వ్యవహారము
**Exchange** : మారకము; వినిమయము; మార్పు
**Trade** : వాణిజ్యము; వ్యాపారము

**SAMPLE : మాదిరి; మచ్చు**

*Synonyms* సమానార్థకములు

**Case** : ఉదాహరణము
**Example** : దృష్టాంతము; ఉదాహరణము; నిదర్శనము
**Exemplification** : దృష్టాంతము; నిదర్శనము
**Illustration** : ఉదాహరణము; వివరణము
**Instance** : దృష్టాంతము; ఉదాహరణము
**Specimen** : మచ్చు; మాదిరి

*Antonyms* వ్యతిరేకార్థకములు

**Abnormality** : అసాధారణత్వము; అస్వాభావికత్వము; విపరీతత్వము
**Aggregate** : మొత్తము; రాసి; కూడినది; వెరసి
**Exception** : అపవాదము; ప్రతిషేధము; మినహాయింపు
**Monstrosity** : విపరీతత్వము; అద్భుతత్వము; అపరూపము
**Total** : మొత్తము; వెరసి; సంపూర్ణము
**Whole** : సమగ్రము; సకలము; అఖిలము

**SANGUINARY : రక్తప్రీతిగల; రక్తదాహముగల**

*Synonyms* సమానార్థకములు

**Bloodthirsty** : రక్తపిపాసువైన; అతిక్రూరమైన
**Bloody** : క్రూరమైన; రక్తమయమైన
**Cruel** : క్రూరమైన
**Gory** : పేరిన నెత్తురుతో కూడిన
**Inhuman** : అమానుషమైన; క్రూరమైన; నిర్దయాత్మకమైన
**Murderous** : హత్య సంబంధమైన; ఘాతుకమైన; అతిక్రూరమైన; హత్య చేసెడు
**Sanguine** : రక్తవర్ణమైన
**Savage** : ఆటవిక; కిరాతక; నిర్దయాత్మక

**SATISFY : తృప్తిపరచు; సంతోషపెట్టు; నెరవేర్చు; మెప్పించు; సందేహ నివృత్తి చేయు**

*Synonyms* సమానార్థకములు

**Cloy** : ముఖము మొత్తు; మిక్కుటముగా తినిపించు
**Content** ; తృప్తిపరచు
**Fill** : నింపు; పూరించు
**Glut** : అతియగునట్లు నింపు; కూరు; నిండించు
**Pall** : రుచి లేకుండచేయు
**Sate** : వలసినదానికన్న ఎక్కువగా ఇచ్చు
**Sutiate** : తృప్తిపరచు; తనివి తీర్చు
**Suffice** : చాలిఉండు; తృప్తిపరచు
**Surfeit** : తెగతిను; వెక్కసమగునట్లు అనుభవించు

*Antonyms* వ్యతిరేకార్థకములు

**Check** : వారించు; ఆటంకపర్చు; అణచు; నిగ్రహించు; సరిచూచు
**Deny** : నిరాకరించు; కాదను; లేదను; త్రోసిపుచ్చు; అంగీకరింపకపోవు
**Disappoint** : భంగపుచ్చు; భంగించు
**Refuse** : నిరాకరించు; ఒల్లకపోవు
**Restrain** : నిరోధించు; అదుపులో ఉంచు; నిగ్రహించు

**Restrict** : కట్టుబాటులో ఉంచు; మేర దాటకుండ జేయు; నిర్బంధించు
**Starve** : వటించు; తిండిలేకమాడు; ఎండగట్టు; పస్తుపెట్టు
**Stint** : మితములో పెట్టు; మట్టుపరచు
**Straiten** : ఇరుకుచేయు; బిగించు; ఇబ్బందిలో పెట్టు; కష్టదశ కలుగజేయు
**Tantalize** : ఊరించు; పీడించు

**SCHOLAR : విద్యార్థి; విద్వాంసుడు**

*Synonyms* సమానార్థకములు

**Disciple** : శిష్యుడు; అంతేవాసి; ఛాత్రుడు
**Fellow** : సహవర్తి; సహపాఠి
**Learner** : విద్యార్థి; నేర్చుకొనుచున్న వాడు
**Pedant** : పాండిత్యగర్వి
**Pupil** : శిష్యుడు; అధ్యేత
**Savant** : బుధుడు; పండితుడు; విద్వజ్జనుడు
**Student** : విద్యార్థి

*Antonyms* వ్యతిరేకార్థకములు

**Dunce** : జడుడు; మందబుద్ధి
**Fool** : వెంగలి; అవ్యక్తుడు; హాస్యకాడు; బుద్ధిహీనుడు
**Idiot** : వివేకహీనుడు; మందబుద్ది; వెర్రివాడు; మూర్ఖుడు; బాలిశుడు
**Idler** : సోమరిపోతు; పనిలేనివాడు
**Ignoramus** : అవివేకి
**Illiterate person** : పామరుడు; చదువు రానివాడు; నిరక్షరాస్యుడు

**SCIENCE : శాస్త్రము; విజ్ఞానము; విద్య**

*Synonyms* సమానార్థకములు

**Erudition** : పాండిత్యము; వ్యుత్పత్తి
**Knowledge** : ఎరుక; తెలివి; జ్ఞానము
**Learning** : విజ్ఞానము; పాండిత్యము
**Lore** : చదువు; జ్ఞానము; విద్య; సంప్రదాయము

**SECURE : సురక్షితమైన; భద్రమైన**

*Synonyms* సమానార్థకములు

**Assured** : అసందిగ్ధమైన; సునిశ్చితమైన; అసంశయమైన, దృఢమైన
**Careless** : చీకు చింతలులేని
**Certain** : రూఢమైన; నిక్కమైన; ధ్రువమైన
**Confident** : నమ్మకముగల; ధైర్యముగల
**Defended** : ప్రతివాదము చేయబడిన, కాపుదలగల; బలపర్చబడిన
**Guarded** : రక్షింపబడిన; భద్రము చేయబడిన
**Impregnable** : సాధింపశక్యముకాని; ముట్టడివేసి జయింప సాధ్యముకాని
**Insured** : భద్రముచేయబడిన; అభయమైన
**Protected** : రక్షింపపడిన; ఆదరింపబడిన; శరణమీయబడిన
**Safe** : భద్రమైన; సురక్షితమైన; నిరపాయమైన
**Sure** : నిశ్చయమైన; నిజమైన; తప్పనిదైన
**Unassailable** : పైబడుటకు వీలుకాని; ముట్టడించుటకు వీలుకాని
**Undisturbed** : కలతలేని; క్షోభములేని; నిశ్చలమైన; నెమ్మదిగానున్న
**Unmolested** : తొందరలేని; ఉపద్రవము లేని; పీడలేని
**Unsuspecting** : సంశయములేని; శంకలేని

Untroubled : చిక్కులోపడని; శ్రమలేని; కష్టములేని; ఇబ్బందిలేని

*Antonyms* వ్యతిరేకార్థకములు

Dangerous : హానికరమైన
Dubious : సందిగ్ధమైన; అనుమానాస్పదమైన; అనిశ్చితమైన
Exposed : మరుగులేని; బయటపడిన; చూపబడిన
Hazardous : అపాయమైన; సాహసమైన
Imperfect : అసంపూర్ణమైన; అరగొరయైన
Insecure : పదిలముకాని; భద్రముకాని అపాయకరమైన
Perilous : అపాయకరమైన; విషమమైన; ఆపత్కరమైన
Risky : అపాయకరమైన; ప్రమాదభరితమైన

**SECURITY : అభయము; నిరపాయత; రక్ష; పూచి; పూట; జామీను**

*Synonyms* సమానార్థకములు

Bail : జామీను; పూచీ
Bond : బంధము; ఖరారునామా ఒడంబడిక; పత్రము
Earnest : సంచకరవు; బయానా
Gage : కుదువ
Guarantee : పూచి; ఉత్తరవాది
Guaranty : పూచి; ఉత్తరవాది
Pledge : తాకట్టు; ఆయకము; పూట
Surety : జామీను; పూట

**SEND : పంపు; పంచు**

*Synonyms* సమానార్థకములు

Cast : రువ్వు; విసరు; ప్రయోగించు
Dart : విసరు; బాణవేగముగపోవు
Delegate : ప్రతినిధిగా అధికారమిచ్చు
Depute : నియోగించు; పంచు; ప్రతినిధిగా పంపు
Discharge : తొలగించు; విసర్జించు; విసరివేయు; విడుదలచేయు; నెరవేర్చు; నిర్వహించు
Dismiss : తొలగించు; విడిచిపుచ్చు; బరతరఫుచేయు; పదభ్రంశముచేయు
Dispatch : రవానాచేయు; త్వరగాపంపు
Drive : నడుపు; తోలు
Emit : ప్రసరింపజేయు; వెలువర్చు; పైకి విడుచు
Fling : విరజిమ్ము; రువ్వు
Forward : పంపు; రవానాచేయు
Hurl : రువ్వు; విసరు
Impel : ప్రేరేపించు; ముందరికిత్రోయు
Lance : బల్లెముతో పొడుచు
Launch : ఆరంభించు; ప్రవేశపెట్టు
Project : చాచు; వేయు; పొడుచుకొనివచ్చు; చొచ్చియుండు
Propel : ముందుకు త్రోయు; చోదనచేయు
Sling : ఒడిసెలతో విసరు
Throw : విసరు; రువ్వు; త్రోయు
Transmit : స్థలాంతరమునకు పంపు

*Antonyms* వ్యతిరేకార్థకములు

Bring : తెచ్చు; తీసికొనివచ్చు
Carry : మోయు; తీసికొనిపోవు
Convey : అందిచ్చు మోసికొనిపోవు; తీసికొనిపోవు
Get : తెచ్చు సంపాదించు; చేరు; పొందు
Give : ఇచ్చు
Hand : ఇచ్చు
Hold : పట్టుకొను, అణచిపట్టు; ఆపు

Keep : ఉంచు; నిలుపు; కాపాడు; పోషించు
Receive : స్వీకరించు; చేకొను; అందుకొను
Retain : ఉంచుకొను; నిలిపిఉంచు

**SENSATION : తెలివి; జ్ఞానము; అనుభవము; స్మృతి**

*Synonyms* సమానార్థకములు

Emotion : భావము; భావావేశము; ఆవేశము
Feeling : ఆస్వాదనము; భావము; వేదన
Image : మూర్తి; స్వరూపము; ప్రతికృతి ప్రతిబింబము ;
Percept : గోచరమైనది; గ్రాహ్యమైనది
Perception : ప్రమ; జ్ఞానము; దృష్టి; గ్రాహ్యత
Sense : అర్థము; ఇంద్రియ బోధ; భావము; జ్ఞానము

**SENSIBILITY : ఇంద్రియజ్ఞానము; ఇంద్రియ గోచరము**

*Synonyms* సమానార్థకములు

Feeling : ఆస్వాదము; భావము; వేదన
Impressibility : చెరగని ముద్ర; ఆకర్షణ; అనుభవక్షమత
Sensitiveness : సున్నితము; శీఘ్ర గ్రాహిత్వము
Susceptibility : సులభముగా మనో వికారము నొందుట

*Antonyms* వ్యతిరేకార్థకములు

Coldness : ఉదాసీనత; చల్లదనము; శీతలత్వము
Deadness : నిర్జీవిత్వము; జడత్వము
Hardness : కాఠిన్యము; గట్టితనము; కష్టము
Insensibility : అవివేకము; బుద్ధి హీనత; అచేతనత; అనుభవశక్తిరాహిత్యము
Numbness : తిమ్మిరి; చిమ్మిటి
Unconsciousness : ఎరుకలేమి; తెలివిలేమి; మైమరపు; స్మృతి లోపము

**SERIOUS : గంభీరమైన; గడ్డైన; అనుపేక్షణీయమైన; ముమ్మరమైన**

*Synonyms* సమానార్థకములు

Dangerous : హానికరమైన; ప్రమాదభరితమైన
Demure : గంభీరమైన; నంగనాచియైన; వినయము నటించు
Earnest : మనఃపూర్వకమైన; శ్రద్ధగల; ఉత్సుకత్వముగల .
Grave : గంభీరమైన; డెప్పరమైన; అనుపేక్షణీయమైన
Great : గొప్పదైన; పెద్దదైన; మహత్తరమైన
Important : ముఖ్యమైన; ప్రధానమైన; ఆవశ్యకమైన
Momentous : గురుత్వవిశిష్టమైన; అతి ముఖ్యమైన; ప్రబలమైన
Sedate : శాంతమైన; నెమ్మదియైన; చెదరని; ఆకులపాటు లేని
Sober : ప్రమత్తత లేని; నెమ్మదిగల; గంభీరమైన
Solemn : గంభీరమైన; పవిత్రమైన; ప్రమాణపూర్వకమైన
Staid : శాంతమైన; నెమ్మదియైన

*Antonyms* వ్యతిరేకార్థకములు

Careless : జాగ్రత్తలేని
Gay : ఉల్లాసముగల

**Insignificant** : అల్పమైన; అప్రధానమైన; అపరిగణనీయమైన
**Jocose** : వినోదకరమైన
**Jolly** : ఉల్లాసముగల; ఉత్సాహముగల
**Light** : తేలికయైన; సులభమైన; సుకరమైన
**Slight** : కొంచెమైన
**Thoughtless** : అనాలోచితమైన; ఆలోచన లేని; వివేకము లేని
**Trifling** : స్వల్పమైన; కొంచెమైన; తృణప్రాయమైన
**Trivial** : అల్పమైన; సామాన్యమైన
**Volatile** : ఆవిరియై పోయెడు; చపలమైన

**SEVERE : దారుణమైన; పరుషమైన; ఉగ్రమైన; తీవ్రమైన; కఠినమైన**

*Synonyms* సమానార్థకములు

**Austere** : కఠినమైన; ఉగ్రమైన; నిష్ఠగల
**Hard** : గట్టియైన; క్రూరమైన; తీవ్రమైన; కఠినమైన
**Harsh** : పరుషమైన; నిర్దయమైన
**Inexorable** : ప్రార్థనను వినని; నిర్దయాత్మకమైన; కఠినమైన
**Inflexible** : వంగని; గడుసైన; లొంగని; మూర్ఖమైన; పెడసరమైన
**Relentless** : నిర్దయమైన; క్రూరమైన
**Rigid** : కర్కశమైన; గట్టియైన; కఠినమైన; వంగని
**Rigorous** : కఠోరమైన; క్రూరమైన
**Stern** : నిష్ఠురమైన; కఠినమైన
**Stiff** : బిరుసైన; గట్టి; పెడసరమైన
**Strict** : కచ్చితమైన; ఖండితమైన; కఠినమైన; నియమబద్ధమైన
**Uncompromising** : సంధికి సమ్మతింపని; వెనుదీయని; నిశ్చలమైన
**Unmitigated** : ఉపశాంతిలేని; శాంతింపని; తగ్గని
**Unrelenting** : నిర్దయమైన; క్రూరమైన; కర్కశమైన
**Unyielding** : లొంగని; వంగని; బిరుసైన

*Antonyms* వ్యతిరేకార్థకములు

**Affable** : సౌలభ్యముగల; సరసత్వముగల; సౌమ్యమైన
**Bland** : శాంతమైన; మృదువైన; సౌమ్యమైన
**Easy** : సుకరమైన; సులువైన; సులభమైన
**Genial** : సంతోషస్వభావముగల; దయగల; పుష్టిగల
**Gentle** : సౌమ్యమైన; సాధువైన; సరసమైన
**Indulgent** : దాక్షిణ్యముగల; దయగల; కోరికలు మన్నించెడు; కఠినత్వములేని
**Lenient** : సౌమ్యమైన; సదయమైన; కనికరముగల
**Mild** : సాధువైన; మృదువైన; శాంతమైన; నమ్రమైన
**Pliable** : మెత్తని; మృదువైన
**Soft** : మెత్తని; మృదువైన; సాధువైన
**Sweet** : మనోహరమైన; కమ్మని; తీయని; మధురమైన; మనోజ్ఞమైన
**Tender** : సుకుమారమైన; లేతయైన; మెత్తని; గట్టిలేని; అదృఢమైన
**Tractable** : విధేయశీలమైన; చెప్పినట్లు వినునట్టి
**Yielding** : లొంగిపోయెడు; భరించెడు; అంగీకరించెడు; విడిచిపెట్టెడు

**SHAKE : విదల్చు; కుదిలించు; కదలించు**

*Synonyms* సమానార్థకములు

Agitate : వ్యాకులపెట్టు; కళవళపెట్టు; మథించు
Brandish : ఝుళిపించు; విసరు; ఆడించు
Flap : రెక్కలు జాడించు; కొట్టుకొను
Fluctuate : నిలకడలేకుండు; డోలాయమానమగు
Flutter : రెక్కలు రెపరెపకొట్టుకొను; తల్లడపడు
Jar : కలహించు; కంపించు
Joggle : కదలించు; కుదుపు
Jolt : కుదుపు
Jounce : కదుపు; త్రోయు
Oscillate : ఊగు; ఉరియాడు
Quake : కంపించు; వణకు
Quaver : వణకు; కంపించు
Quiver : వణకు; కంపించు
Reel : దొర్లు; తూలు
Rock : తూగు; ఊచు; ఊగు
Shiver : వణకు; కంపించు; ముక్కలగు; తునాతునకలగు
Shudder : విహ్వలించు; కంపించు
Sway : అధికారమునెరపు; ఝుళిపించు; మొగ్గు; చేతితో త్రిప్పు
Swing : ఊగు; తూగు; త్రిప్పు
Thrill : జలదరించు; గుచ్చుకొను
Totter : కదలు; తూలిపోవు; సంచలించు
Tremble : వణకు; కంపించు
Vibrate : కంపించు; స్పందించు; ఊగు
Wave : జళిపించు; వీచు
Waver : వెనుకముందులాడు; ఊగు; సంకోచించు

**SHELTER : అండయిచ్చు; ఆశ్రయమిచ్చు; ఆదరమిచ్చు; చోటిచ్చు**

*Synonyms* సమానార్థకములు

Cover : దాచు
Defend : సమర్థించు; కాపాడు; రక్షించు
Guard : కాపాడు; సంరక్షించు; కనిపెట్టియుండు
Harbor : దాచు; ఆశ్రయమిచ్చు; తావిచ్చు; కాపాడు
Protect : రక్షించు; కాపాడు; శరణమిచ్చు; ఆదరించు
Screen : చాటుచేయు; అడ్డుపెట్టుకొను; మరుగుపెట్టు
Shield : రక్షించు; రక్షణ ఇచ్చు
Ward : కాచు; రక్షించు; నివారించు

*Antonyms* వ్యతిరేకార్థకములు

Betray : నమ్మినవానిని చెరచు; విశ్వాసభంగము చేయు; ద్రోహము చేయు; రహస్యమును బయలుపర్చు
Cast out : విడిచిపెట్టు
Expel : గెంటు; వెడలగొట్టు
Expose : బాహిరపెట్టు; కనుపర్చు; అగడుపర్చు
Give up : వదలుకొను; మానుకొను
Refuse : నిరాకరించు; ఒల్లకపోవు
Reject : త్రోసిపుచ్చు; నిరాకరించు
Surrender : లోబడు; అప్పగించు; అర్పించు

**SHREWD : చతురతగల; సూక్ష్మబుద్ధిగల; యుక్తిగల; వివేకముగల**

*Synonyms* సమానార్థకములు

Acute : తీవ్రమైన; నిశితమైన; కఠినమైన; వాడియైన; సూక్ష్మబుద్ధిగల

**Artful** : నేర్పుగల; చమత్కారముగల;
**Astute** : సూక్ష్మబుద్ధిగల, జాణతనముగల
**Clear-sighted** : వివేకశాలియైన; సూక్ష్మదృష్టిగల
**Crafty** : యుక్తిగల; జిత్తులమారియైన
**Cunning** : ఉపాయముగల; నేర్పుగల; జిత్తులమారియైన; వంచనయైన
**Discerning** : తెలివిగల; వివేకశాలియైన
**Discriminating** : భేదపరచునట్టి; చిహ్నమైన
**Keen** : నిశితమైన; వాడియైన, తీక్ష్ణమైన; తీవ్రమైన
**Knowing** : తెలివిగల, నేర్పుగల; వెరవుగల; జిత్తులమారియైన
**Penetrating** : } తీక్ష్ణబుద్ధిగల; సూక్ష్మబుద్ధిగల
**Penetrative** : }
**Perspicacious** : తీక్ష్ణదృష్టిగల; సూక్ష్మదృష్టిగల
**Sagacious** : వివేకముగల; విచక్షణశీలమైన
**Sharp** : వాడియైన; నిశితమైన; తీక్ష్ణమైన
**Subtile** : అతిసూక్ష్మమైన; అణురూపమైన; విరళమైన
**Subtle** : చమత్కారముగల; యుక్తిగల· అతినిపుణమైన; కుటిలమైన

*Antonyms* వ్యతిరేకార్థకములు

**Blind** : అంధమైన; గ్రుడ్డియైన; వివేకహీనమైన
**Dull** : అలసమైన; జడమైన; మందబుద్ధిగల; కాంతిహీనమైన
**Idiotic** : పిచ్చియైన; వెర్రియైన; వివేకహీనమైన; మందబుద్ధియైన
**Imbecile** : దుర్బలమైన; అవివేకియైన
**Shallow** : గాధమైన; లోతులేని; పైపైజ్ఞానముగల
**Shortsighted** : హ్రస్వదృష్టిగల; దురాలోచనలేని; ముందాలోచనలేని
**Stolid** : మిక్కిలి మొద్దైన; జడుడైన; అతిమందబుద్ధిగల
**Stupid** : ఈబరియైన, బుద్ధిహీనమైన; మూర్ఖమైన
**Undiscerning** : వివేకములేని; తెలివిలేని
**Unintelligent** : తెలివిలేని; బుద్ధిలేని

**SHUT : మూయు; కప్పు; మడుచు; ముకుళించు**

*Synonyms* సమానార్థకములు

**Bar** : అడ్డుపెట్టు, ఆటంకపరచు
**Beleaguer** : ముట్టడించు
**Block** : మూసివేయు; అడ్డముపెట్టు
**Blockade** : కోటముట్టడించు
**Close** : ముగించు; మూయు; దగ్గరగాచేర్చు
**Close up** : నిరోధించు
**Confine** : చెరలోనుంచు; హద్దులోనుంచు
**Coop up** : గూటిలోపెట్టిమూయు
**Enclose** : చుట్టుకొను; పరివేష్టించు; లోపలపెట్టిమూయు
**Exclude** : త్రోసివేయు; మినహాయించు; బహిష్కరించు, వెలివేయు
**Imprison** : బందిగొను; చెరలోపెట్టు
**Intercept** : అడ్డగించు; ఆటంకపర్చు; విచ్ఛేదముచేయు
**Lock up** : కొద్దికాలము చెరసాలలోనుంచు
**Preclude** : ఆటంకపెట్టు; నిరోధించు; నివారించు
**Prohibit** : నిషేధించు; కూడదను
**Seal** : గుప్తముగానుంచు
**Stop** : నిలుపు; అడ్డగించు; నిలుచు

*Antonyms* వ్యతిరేకార్థకములు

**Expand** : విస్తరించు; విస్తరింపజేయు; వ్యాపించు; వికసించు; సాగు
**Let loose** : హద్దులేకుండ ప్రవర్తించు; హద్దులేకుండ విడిచిపెట్టు
**Liberate** : స్వేచ్ఛకలిగించు; విడిచిపుచ్చు; విమోచనము కలిగించు
**Open** : తెరచు; వికసించు; విచ్చు; విప్పు
**Set free** : విడిపించు
**Unbar** : తెరచు; అడ్డుతీయు
**Unclose** : తెరచు; విప్పు
**Undo** : త్రిప్పివేయు; మార్చివేయు; అన్యథాకరించు; చెరచు; పాడుచేయు
**Unfasten** : కట్టువిప్పు; విప్పు

**SIGN : లక్షణము; చిహ్నము; గుర్తు; జాడ**

*Synonyms* సమానార్థకములు

**Augury** : శకునము; సోదె
**Badge** : చిహ్నము; గుర్తు
**Emblem** : గుర్తు; చిహ్నము; లాంఛనము; ఆనవాలు
**Indication** : సూచన; ఆనవాలు; గురుతు
**Manifestation** : ప్రాదుర్భావము; విశదీకరణము; అభివ్యక్తి; సాక్షాత్కారము
**Mark** : సంజ్ఞ; గుర్తు; లక్ష్యము, గురి
**Note** : చీటి; గుర్తు; కీర్తి; వ్యాఖ్యానము; వివరణము
**Omen** : శకునము
**Portent** . దుర్నిమిత్తము; ఉత్పాతము
**Presage** : భావిసూచన; శకునము
**Prognostic** : ముందుసూచన
**Signal** : దూరసంజ్ఞ; గుర్తు; సంకేతము
**Symbol** : చిహ్నము; గుర్తు; సంకేతము
**Symptom** : లక్షణము; రోగలక్షణము; చిహ్నము; సూచకము
**Token** : గురుతు; చిహ్నము
**Type** : మాదిరి; చిహ్నము

**SIMILARITY : సాదృశ్యము; పోలిక; ఉపమానము**

*Synonyms* సమానార్థకములు

**Affinity** : సామ్యము; సాదృశ్యము; సంబంధము; బంధుత్వము
**Analogy** : సాదృశ్యము; పోలిక; సంబంధము
**Coincidence** : ఏకకాలమందు సంభవించుట; ఏకీభవించుట; సమమగుట; సరియగుట
**Comparison** : పోలిక; సాటి; తుల్యత్వము
**Likeness** : పోలిక; సామ్యము; ప్రతిమ
**Parity** : సమానత్వము; పోలిక
**Proportion** : పాలు; వంతు; నిష్పత్తి
**Relation** : సంబంధము; బంధుత్వము; వావి
**Resemblance** : పోలిక
**Semblance** : పోలిక; ఆభాసము
**Simile** : ఉపమ; ఉపమానము
**Similitude** : పోలిక; ఉపమానము

*Antonyms* వ్యతిరేకార్థకములు

**Disagreement** : భేదము; అసమ్మతి; సరిపడమి; విరోధము
**Disproportion** : వైషమ్యము; వ్యత్యాసము; అసమత; హెచ్చుతగ్గు
**Dissimilarity** : అసమానత; పోలమి; భేదము; భిన్నత్వము
**Incongruity** : అసంబంధము; విరుద్ధము; అసంగతము; అసంగతి

Unlikeness : పోలమి; భేదము

**SIN : పాపము; అపరాధము; దుష్కృతము**

*Synonyms* సమానార్థకములు

Crime : నేరము; దోషము; తప్పిదము; దుర్ణయము; అపరాధము; దండనార్హకృత్యము
Cirminality : నేరము; అపరాధిత్వము
Dclinquency : అపరాధము; నేరము; తప్పు; దోషము
Depravity : దుర్ణయము; నీతిభ్రష్టత
Evil : చెడ్డ; కీడు; చెరుపు; ఆపద; అపకారము
Fault : దోషము; తప్పిదము
Guilt : అపరాధము; పాపము
Ill-doing : కీడు
Immorality : దుర్నీతి, చెడునడత
Iniquity : అన్యాయము; దుష్కృత్యము; పాపము
Misdeed : దుష్కృత్యము; తప్పిదము
Offense : నేరము; అపరాధము; ద్రోహము; అపచారము
Transgression : మేరమీరుట; విధిని అతిక్రమించుట; ఆజ్ఞోల్లంఘనము
Ungodliness : దైవభక్తిలేమి
Unrighteousness : అధర్మము; అన్యాయము; పాపము; దుర్మార్గము
Vice : దురభ్యాసము; వ్యసనము; దుర్గుణము
Viciousness : దుష్టత్వము; దుర్మార్గత్వము
Wickedness : దుష్టతనము; దుర్జనత్వము; కూళతనము
Wrong : తప్పు; అపకారము; అపచారము; అధర్మము
Wrong-doing : అపకారము

*Antonyms* వ్యతిరేకార్థకములు

Blamelessness : నిందలేమి; తప్పులేమి
Excellence : శ్రేష్ఠత; ఉత్కర్ష; ఉత్తమత్వము
Godliness : దైవభక్తి
Goodness : మంచితనము; దయ
Holiness : పుణ్యము; పవిత్రత
Innocence : అమాయకత్వము; నిష్కాపట్యము; నిర్దోషిత్వము
Integrity : నీతి; న్యాయబుద్ధి; అఖండత్వము
Morality : సచ్ఛీలము; నీతిబద్ధత
Purity : పవిత్రత; శౌచము; నిర్దుష్టత
Rectitude : నీతివర్తనము; ఆర్జవము; సరళత; తిన్నదనము
Right : న్యాయము; అర్హత; స్వాతంత్ర్యము; హక్కు; అధికారము
Righteousness : ధార్మికత్వము; న్యాయబుద్ధి
Sinlessness : పాపరాహిత్యము; నిర్దోషిత్వము
Uprightness : న్యాయప్రవర్తన; నిజాయితీ
Virtue : నీతి; సన్మార్గము; సుగుణము; పవిత్రత; పాతివ్రత్యము

**SING : పాడు; గానముచేయు**

*Synonyms* సమానార్థకములు

Carol : సంతోషముతో పాడు; పదములు పాడు
Chant : స్వరయుక్తముగా చదువు; రాగధోరణిగా చదువు
Chirp :
Chirrup : } కిచకిచలాడు; కిచకొట్టు

Hum : ఝుంకారముచేయు; ఊకొట్టు; కలకలధ్వని చేయు
Warble : కంపస్వరముతో పాడు; కూజించు; కలధ్వనిచేయు

**SKEPTIC : నాస్తికుడు; సంశయాత్ముడు; విశ్వాసము లేనివాడు**

*Synonyms* సమానార్థకములు

Agnostic : అజ్ఞాతావాది; దేవుడు మనుష్యులకు తెలియబడడని వాదించువాడు
Atheist : నాస్తికుడు
Deist : శ్రుతులను నమ్మకయే దేవుడున్నాడనువాడు
Disbeliever : అవిశ్వాసి; నమ్మనివాడు
Doubter : సంశయాళువు
Freethinker : ప్రమాణ మంగీకరింపక తనకుతోచినట్లు ఆలోచించువాడు; నాస్తికుడు
Infidel : నాస్తికుడు
Unbeliever : నమ్మనివాడు; నాస్తికుడు

*Antonyms* వ్యతిరేకార్థకములు

Believer : ఆస్తికుడు; దైవభక్తుడు
Christian : క్రీస్తుమతస్థుడు

**SKETCH : నమూనా; చిత్తుప్రాత; ఆకార చిత్రము; రమారమియైన ఆకారము**

*Synonyms* సమానార్థకములు

Brief : సంగ్రహము; సంక్షేపము
Delineation : వర్ణన; చిత్రణము; లేఖనము
Design : నమూనా
Draft : ముసాయిదా; చిత్తుప్రాత
Drawing : పటము; నమూనా
Outline : నమూనా; స్వరూపము; ఆకారరేఖ
Painting : చిత్రలేఖనము; పటము; ఆలేఖ్యము
Picture : చిత్రము; పటము; బొమ్మ; ప్రతిరూపము; స్వరూపము
Plan : నమూనా; పథకము; కల్పన; యుక్తి
Portrayal : వర్ణన; చిత్రణ
Representation : వర్ణనము; పోలిక
Skeleton : ఎముకలగూడు; ఆకారరేఖ

**SKILFUL : నేర్పుగల; నిపుణుడైన; చతురుడైన; ప్రవీణుడైన; ఉపాయశాలియైన**

*Synonyms* సమానార్థకములు

Accomplished : సకల విద్యలు నేర్చిన; ప్రవీణుడైన; విశారదుడైన; నిపుణతగల
Adept : ప్రవీణమైన; ప్రగల్భమైన; చతురమైన
Adroit : చమత్కార సాహసముగల; నేర్పుగల; నిపుణతగల
Apt : యుక్తమైన; తగిన; అర్హమైన; స్వభావముగల
Clever : నేర్పుగల; తెలివిగల; నిపుణమైన
Deft : నిపుణమైన; నేర్పుగల; సొగసైన; నీటైన
Dexterous : నిపుణమైన; నేర్పుగల; సొగసైన; నీటైన
Expert : ప్రగల్భుడైన; నిష్ణాతుడైన; ప్రవీణుడైన
Handy : నేర్పుగల; వాటముగాఉన్న; సదుపాయముగా ఉన్న

Happy : సుఖితమైన; శుభమైన; సంతుష్టమైన; అదృష్టవంతమైన
Ingenious : చమత్కారమైన; సూక్ష్మబుద్ధిగల
Practiced : అలవాటుపడిన; సాధనచేసిన; రివాజుపడిన
Proficient : ప్రవీణతగల; పాండిత్యముగల
Skilled : ప్రవీణతగల; కుశలతగల; నేర్చిన; నిపుణుడైన; ఉపాయశాలియైన
Trained : నేర్చిన; శిక్షణపొందిన; అభ్యాసముగల; తర్ఫీదుపొందిన

*Antonyms* వ్యతిరేకార్థకములు

Awkward : అకటవికటమైన; కొంకిబికియైన, వికృతమైన; అరమ్యమైన; అబందరమైన
Bungling : ఎడ్డెతనముగాచేసిన; వ్యవహారదక్షతలేని; చేతగానితనపు
Clumsy : మోటైన; అనిపుణమైన
Helpless : నిరాధారమైన; దిక్కులేని
Inexpert : చేయితిరుగని; చేతగాని; అభ్యాసములేని; చతురతలేని; నేర్పులేని
Maladroit : నైపుణ్యహీనమైన
Shiftless : నేర్పులేని
Unhandy : విచారకరమైన; దుఃఖితుడైన దురదృష్టవంతుడైన
Unskilled : చేతకాని; నైపుణిలేని
Untaught : అవిజ్ఞాతా స్ఫోరకమైన
Untrained : అశిక్షితమైన

**SLANDER : తిట్టు; దూషించు; నిందవేయు; కొండెము చెప్పు**

*Synonyms* సమానార్థకములు

Asperse : దూషించు; నిందించు
Backbite : చాడీచెప్పు; కొండెములు చెప్పు; పరోక్షమందు నిందించు
Calumniate : అపవాదువేయు; అవమానపర్చు
Decry : నిందించు; తెగడు; దూరు; దూషించు
Defame : అపకీర్తి తెచ్చు; పేరుచెరచు
Depreciate : కొంచెపర్చు; చులకనచేయు
Detract : హానికలిగించు; తక్కువపర్చు; అపవాదువేయు
Disparage : తృణీకరించు; తిరస్కరించు; తక్కువపర్చు
Libel : పేరుచెరచు; అపకీర్తి కలుగజేయు
Malign : నిందించు; ద్వేషించు; దూషించు
Revile : ఎగ్గాడు; దూషించు; నిందించు
Traduce : నిందించు; దూషించు
Vilify : దూషించు, అపనిందవేయు

*Antonyms* వ్యతిరేకార్థకములు

Defend : సమర్థించు; ప్రతివాదముచేయు; రక్షించు; కాపాడు
Enlogize : స్తుతించు, అగ్గించు; శ్లాఘించు
Extol : కొనియాడు; మెచ్చుకొను; పొగడు
Laud : స్తుతించు; పొగడు
Praise : స్తుతించు
Vindicate : నిజము సమర్థించు; నిర్దోషిత్వమునిరూపించు

**SLANG : పామరభాష; గ్రామ్యభాష; (దొంగల) సంకేతభాష**

*Synonyms* సమానార్థకములు

Argot : పరిభాష
Cant : పసమాటలు; కపటభాషణము
Colloquialism : వ్యావహారికభాష

Vulgarism : అసభ్యమైన నీచపుభాష

**SLOW : మెల్లని; మందమైన; చురుకుతనము లేని**

*Synonyms* సమానార్థకములు

Dawdling : కాలమువృథాపుచ్చుచున్న
Delaying : ఆలస్యముచేయు; జాగుచేయు; కాలయాపనచేయు
Deliberate : సావధానమైన; ఆలోచనాపూర్వకమైన
Dilatory : జాగుచేసెడు; ఆలసించెడు
Drowsy : నిద్రమత్తుగా ఉన్న
Dull : అలసమైన; జడమైన; మందబుద్ధిగల
Gradual : క్రమక్రమమైన
Inactive : సోమరియైన; నిశ్చేష్టమైన; మందమైన
Inert : జడమైన; అచేతనమైన; చలనములేని
Laggard : మందమైన; అలసమైన
Leisurely : సావకాశముగాచేసెడు; మెల్లగానైన; తీరికగల; తీరుబడిగల; ఉబుసుపోకయగు
Lingering : జాగుచేసెడు; ఆలస్యముచేసెడు; చాలకాలముగాఉన్న
Moderate : మితమైన; తగుమాత్రమైన; మోతాదైన
Procrastinating : ఆలస్యముచేసెడు; కాలవిలంబముచేసెడు; మరియొకనాటికి త్రోసిపుచ్చెడు
Slack : బిగువులేని; శ్రద్ధలేని, అదృఢమైన
Sluggish : సోమరియైన; శక్తిహీనమైన; అలసమైన
Tardy : మందమైన; మెల్లని, అలసమైన

*Antonyms* : See Synonyms for NIMBLE

**SMELL : వాసన; పరిమళము; ఘ్రాణశక్తి**

*Synonyms* సమానార్థకములు

Aroma : సువాసన; సుగంధము
Bouquet : మంజరి; పూలచెండు; పూగుత్తి; పూబంతి
Fragrance : సౌరభము; తావి; సువాసన
Odor : వాసన; దుష్కీర్తి
Perfume : పరిమళము; సువాసన
Savor : రుచి
Scent : సువాసన; గంధము; పసి; జాడ
Stench : కంపు; దుర్గంధము
Stink : కంపు; దుర్వాసన

**SNEER : హేళన చేయు; పరిహసించు**

*Synonyms* సమానార్థకములు

Fling : విరజిమ్ము; రువ్వు; విసరివేయు
Gibe : దెప్పు; ఎగతాళిచేయు
Jeer : వెక్కిరించు; ఎత్తిపొడుచు; ఎగతాళిచేయు
Mock : వెక్కిరించు
Scoff : తిరస్కరించు; వెక్కిరించు
Taunt : ఎత్తిపొడుచు; దెప్పు; ఉల్లికుట్టు మాటలాడు

**SOCIALISM : సామ్యవాదము**

*Synonyms* సమానార్థకములు

Anarchism : అరాజకవాదము
Bolshevism : రష్యాదేశ విప్లవవాదము
Collectivism : సమష్టివాదము; సమష్టిభుక్తివాదము
Communism : సార్వజనీన సమాజవాదము; కమ్యూనిజం

Nihilism : శూన్యవాదము; మిథ్యా వాదము

**SOUND : ధ్వని; శబ్దము**

*Synonyms* సమానార్థకములు

Noise : సందడి; చప్పుడు, మ్రోత; సద్దు
Note : స్వరము
Tone : నాదము; ఫణితి; రీతి; స్వరము

**SPEAK : మాటాడు; వచించు; పలుకు; ఉపన్యసించు**

*Synonyms* సమానార్థకములు

Announce : ప్రకటించు; తెలియపర్చు; వెల్లడించు
Articulate : ఉచ్చరించు (స్పష్టముగా)
Chat : ముచ్చటించు; సరస సల్లాపము చేయు; ఇష్టగోష్ఠి చేయు
Chatter : వదరు; వాగు
Converse : సంభాషించు
Declaim : ఉపన్యసించు
Declare : ప్రకటించు; వక్కాణించు; బాహాటముగా చెప్పు
Deliver : చెప్పు; ఉపన్యసించు; ఉచ్చరించు
Discourse : ప్రసంగించు; సంభాషించు; మాటాడు
Enunciate : చెప్పు; వివరించు; తెలియజేయు
Express : వ్యక్తము చేయు, స్పష్టపరచు; వక్కాణించు
Pronounce : పలుకు; ఉచ్చరించు, ఉగ్గడించు
Say : చెప్పు; అను; పలుకు
Talk : మాటాడు; సంభాషించు
Tell : చెప్పు; తెలియజేయు: వక్కాణించు
Utter : ఉచ్చరించు; పైకిచెప్పు

**SPECTACLE : దృశ్యము; వింత; వేడుక**

*Synonyms* సమానార్థకములు

Display : ప్రదర్శనము; ఆడంబరము
Exhibition : వస్తుప్రదర్శనము; ప్రదర్శనము
Pageant : ఉత్సవము; సంబరము
Parade : ఆడంబరప్రదర్శనము, బారులు తీర్చి నిలబెట్టుట
Representation : విజ్ఞాపనము; ప్రాతినిధ్యము; ఉదాహరణము
Scene : రంగము; రంగాలంకరణము; రమ్యదృశ్యము
Show : వేడుక; నటన, డాబు; రూపు
Sight : దర్శనము; వినోదము; వేడుక; వింత

**SPEECH : మాట; వచస్సు; ఉక్తి; ఉపన్యాసము; ప్రసంగము; భాష**

*Synonyms* సమానార్థకములు

Address : పిలుపు; సంబోధన; ఉపన్యాసము
Discourse : సల్లాపము; గోష్ఠి; పెద్ద వ్యాసము; ఉపదేశగ్రంథము
Disquisition : ప్రసంగము; ఉపన్యాసము; మీమాంస; విచారణ; రచ్చ
Dissertation : ప్రసంగము, గ్రంథము; వ్యాసము; ప్రబంధము; ఉపన్యాసము
Harangue : ఉపన్యాసము; ప్రసంగము
Homily : ధర్మోపదేశప్రసంగము; ఉపదేశోపన్యాసము
Language : భాష; మాటవైఖరి
Lecture : ఉపన్యాసము; ప్రసంగము
Oration : గంభీరోపన్యాసము

**Oratory** : వక్తృత్వము
**Sermon** : ధర్మోపన్యాసము
**Speaking** : భాషణము; ప్రసంగము
**Talk** : ప్రసంగము; వదంతి
**Utterance** : ఉచ్చారణ; వచస్సు

*Antonyms* వ్యతిరేకార్థకములు

**Hush** : నిశ్శబ్దము
**Silence** : నిశ్శబ్దము; మౌనము; నెమ్మది
**Speechlessness** : మూగతనము
**Stillness** : నిశ్శబ్దత; ప్రశాంతత
**Taciturnity** : మౌనశీలత

**SPONTANEOUS : స్వచ్ఛందమైన; సహజమైన; నిర్నిబంధమైన; అప్రయత్నపూర్వకమైన**

*Synonyms* సమానార్థకములు

**Automatic** : స్వయంప్రవర్తకమైన; తనంతటతానే తిరిగెడు; తనంతటతానే ఆడెడు
**Free** : స్వతంత్రమైన; ధారాళమైన, ఉదారమైన; స్వచ్ఛందమైన
**Impulsive** : ముందుకు త్రోసెడు, ప్రేరేపించెడు; సాహసమైన; దుడుకైన
**Instinctive** : సహజమైన; స్వభావమైన; జన్మముతో పుట్టిన
**Involuntary** : అప్రయత్నపూర్వకమైన
**Unbidden** : పిలువబడని
**Voluntary** : స్వచ్ఛందమైన; తనంత చేసిన
**Willing** : ఇష్టముగల; సమ్మతించెడు

**SPY : గూఢచారుడు; వేగులవాడు**

*Synonyms* సమానార్థకములు

**Detective** : అపరాధ పరిశోధకుడు
**Emissary** : దూత; రాయబారి; చారుడు
**Scout** : చారుడు; స్వచ్ఛంద భటుడు; సేవకుడు

**STAIN : మచ్చ; కళంకము; మాలిన్యము; మరక**

*Synonyms* సమానార్థకములు

**Blot** : మచ్చ; కళంకము; తుడుపు
**Color** : రంగు; వర్ణము; మిష; సాకు; వ్యాజము
**Discolor** : వివర్ణత; రంగుమార్పు
**Disgrace** : తలవంపు, అవమానము; మానభంగము
**Dishonor** : అపకీర్తి; అవమానము
**Dye** : రంగు; ఛాయ; వన్నె; అద్దకము
**Soil** : మురికి; మాలిన్యము
**Spot** : మచ్చ; మరక; కళంకము
**Sully** : మురికి; మలినము; మాపు, కళంకము
**Tarnish** : కాంతిహీనత; కాంతిమాపు
**Tinge** : ఛాయ
**Tint** ; లేతరంగు

**STAND : నిలుచు; సహించు; ఓర్చు; తాళు**

*Synonyms* సమానార్థకములు

**Abide** : వేచియుండు; తాళు; సహించు; కట్టుబడియుండు
**Continue** : కొనసాగించు; సాగించు; జరిగించు, ఎడతెగకుండు
**Endure** : సహించు; ఓర్చు; తాళు
**Halt** : నిలుపు; నిలుచు
**Hold out** : చాచు అందించు
**Keep up** : కాపాడు; మేలుకొనియుండు

**Pause** : నిదానించు; ఆగిచూచు
**Remain** : శేషించు; నిలుచు; మిగులు; ఆగియుండు
**Stay** : ఉంచు; నిలుచు; కాచుకొనిఉండు; ఉండు; నిలుపు
**Stop** : నిలుపు; అడ్డగించు; నిలుచు

*Antonyms* వ్యతిరేకార్థకములు

**Decline** : క్షీణించు; తీసిపోవు; నిరాకరించు, త్రోసివేయు; వాలు; ఒరగు
**Droop** : వాలిపోవు; ఈడిగిలబడు; జారు
**Drop** : జార్చు, జారవిడుచు; వదలివేయు
**Fail** : తప్పిపోవు; ఓడిపోవు; భంగపుచ్చు; వదలిపెట్టు
**Faint** : సొలయు; మూర్ఛిల్లు
**Fall** : పడు; కూలు; క్షీణించు; తగ్గు; రాలు; సంభవించు
**Falter** : తడబడు; తొట్రుపడు; సంకోచించు
**Flee** : పారిపోవు; పరచు
**Fly** : ఎగురు; ఎగురవేయు; పారిపోవు, పారదోలు
**Sink** : మునుగు; డిందు; క్రుంగు; లొచ్చగు; ముంచివేయు; కుదియు; ఈడిగిలపడు
**Succumb** : లొంగిపోవు; లోపడు; కుంగిపోవు; చనిపోవు
**Yield** : లొంగిపోవు; ఇచ్చు; విడిచిపెట్టు; భరించు

## STATE : వివరించు; వక్కాణించు

*Synonyms* సమానార్థకములు

**Affirm** : నిర్ధారణగాచెప్పు; రూఢిగాచెప్పు
**Allege** : చెప్పు; అను; ఆరోపించు
**Assert** : నిశ్చితముగా పలుకు; స్థిరముగా చెప్పు; నొక్కిచెప్పు
**Asseverate** : సత్యముగాచెప్పు; నిజముగా పలుకు
**Assure** : నమ్మబలుక్కు; రూఢిగాచెప్పు; హామీఇచ్చు
**Aver** : స్థిరముగాచెప్పు
**Avouch** : నిశ్చయముగచెప్పు; రూఢిగా చెప్పు
**Avow** : ఒప్పుకొను; ఖండితముగాచెప్పు; సప్రమాణముగాచెప్పు
**Certify** : రూఢిచేయు; దృఢపరచు; యోగ్యతాపత్రమిచ్చు
**Claim** : హక్కుకోసము వాదించు; తనదని వాదించు
**Declare** : ప్రకటించు; వక్కాణించు; బాహాటముగాచెప్పు
**Depose**: పదభ్రంశముకలిగించు, తొలగించు; వాఙ్మూలమిచ్చు
**Express** : వ్యక్తముచేయు; స్పష్టపరచు; వక్కాణించు
**Inform** : తెలియజేయు
**Maintain** : పోషించు; నిర్వహించు; కాపాడు; సమర్థించు; నిలుపు
**Predicate** : చెప్పు; గుణమునుగాని, కార్యమునుగాని ఆరోపించు
**Pronounce** : ఉచ్చరించు; పలుకు; చెప్పు; విధించు; ఉగ్గడించు; తీర్మానించిచెప్పు
**Propound** : ప్రతిపాదించు; యోచనకు తెచ్చు; చెప్పు; ఎదుటపెట్టు
**Say** : చెప్పు; అను; పలుకు; సమాధానమిచ్చు
**Set forth** : ప్రదర్శించు
**Specify** : నిర్దేశించు; వివరించు
**Swear** : ప్రమాణముచేయు; బాసచేయు; ఒట్టుపెట్టుకొను
**Tell** : వక్కాణించు; చెప్పు; తెలియజేయు

Testify : సాక్ష్యమిచ్చు; రుజువుచేయు
Vindicate : నిర్దోషిత్వము నిరూపించు; నిజము సమర్థించు

*Antonyms* వ్యతిరేకార్థకములు

Contradict : పూర్వపక్షముచేయు; ఎదురాడు; మారాడు
Contravene : ప్రతికూలించు, ఎదిరించు; అడ్డగించు; అతిక్రమించు; వికటించు
Controvert : లేదనివాదించు, కాదని వాదించు; తర్కించు; వాదమును ఖండించు
Deny : నిరాకరించు; కాదను; లేదను; అంగీకరింపకపోవు; త్రోసిపుచ్చు
Disprove : ఖండించు; అసత్యమని రుజువు చేయు
Dispute : జగడమాడు; తగువుపడు; వాదించు; ఎదురుచెప్పు
Gainsay : పూర్వపక్షముచేయు; ఆక్షేపించు
Oppose : ఎదిరించు; ప్రతిఘటించు; ఎదురు పలుకు
Refute : పూర్వపక్షముచేయు; ఖండించు
Repudiate : నిరాకరించు; ప్రత్యాఖ్యానించు; త్రోసిపుచ్చు
Retract : వెనుకకు మరలు; వెనుకకు మరలించు; తప్పుకొను; తొలగు
Waive : వదలుకొను, త్యజించు

**STEAL : దొంగిలించు; జుణిగి పోవు**

*Synonyms :* సమానార్థకములు

Abstract : దొంగిలించు; అపహరించు; వేరుచేయు; సొంతము చేసికొను
Commit larceny } : దొంగతనము చేయు
Commit theft }
Embezzle : ఒప్పగించిన సొమ్మును అక్రమముగా వినియోగించు
Extort : పిండు; బలవంతముగా తీసికొను
Filch : దొంగిలించు; అపహరించు
Pilfer : చిల్లర దొంగతనము చేయు
Pillage : దోపిడిచేయు; కొల్లగొట్టు
Plunder : చూరగొను; కొల్లగొట్టు; దోచుకొను
Purloin : దొంగిలించు, అపహరించు
Rob : దోచుకొను; దొంగిలించు; హరించు
Swindle : మోసపుచ్చు; వంచించు

*Antonyms* వ్యతిరేకార్థకములు

Give back : తిరిగిఇచ్చు
Give up : వదలుకొను; మానుకొను
Make good : నెరవేర్చు
Refund : వాపసుచేయు
Repay : రుణముతీర్చు; ప్రతిఫలమిచ్చు
Restore : పునఃస్థాపించు; బాగుపరచు; తిరిగియిచ్చు
Return : క్రమ్మరు; మరలు; తిరిగియిచ్చు; తిరిగివచ్చు
Surrender : లోపడు; అప్పగించు; అర్పించు

**STEEP : నిట్రమైన; ఒరకమైన; రమారమియైన; నిలువుగావున్న**

*Synonyms* సమానార్థకములు

Abrupt : తటాలునైన; ఆకస్మికమైన; అసంబంధమైన
High : ఉన్నతమైన; గొప్పయైన; అధికమైన
Precipitous : మిక్కిలినిట్రముగాఉన్న; మిక్కిలి పటవాలుగా ఉన్న; కాలునిలువని; అతిత్వరితమైన

**Sharp** : వాడియైన; పదునుగల; తీక్ష్ణమైన; చురుకైన

**Sheer** : కేవలమైన; పట్టిదైన; శుద్ధమైన; మిశ్రమైన

*Antonyms* వ్యతిరేకార్థకములు

**Easy** : సుకరమైన; సులువైన; సులభమైన

**Flat** : వాడిలేని; చప్పని; సుకరమైన; రసహీనమైన

**Gentle** : సౌమ్యమైన; సాధువైన; సరసమైన

**Gradual** : క్రమక్రమమైన

**Horizontal** : సమముగా ఉన్న; ఒకవైపునకు వాలని; నిలచియున్న; నీటి ఉపరితలమునకు సమమయిన

**Level** : సమమైన, చదునైన; మెరక పల్లములు లేని

**Low** : నీచమైన; హీనమైన; ఎత్తుకాని: ఉన్నతముకాని; పొట్టి; పల్లమైన

**Slight** : స్వల్పమైన; కొంచెమైన; చిన్నదైన, కొద్దియైన

## STOP : నిలుచు; నిలుపు; అడ్డగించు

*Synonyms* సమానార్థకములు

**Abstain** : వదలుకొను; వర్జించు, మానుకొను; హాజరు కాకుండు

**Bring to an end** : ముగించు

**Cease** : విరమించు; విడుచు

**Come to an end** : ముగియు; పూర్తియగు

**Conclude** : ముగించు; నిశ్చయించు

**Desist** : వదలుకొను, చాలించు; ఉజ్జగించు

**Discontinue** : ఆపివేయు; నిలిపివేయు; మానుకొను, చాలించు

**End** : ముగియు; ముగించు; పర్యవసించు

**Finish** : ముగించు; సమాప్తిచేయు; తీర్చు; నెరవేర్చు; సాంతముచేయు

**Give over** : విరమించు

**Intermit** : కొంతసేపుమాను; నిలుచు; విడుచు

**Leave off** : మానివేయు

**Pause** : నిదానించు

**Quit** : విడిచిపోవు; వదలిపోవు; తొలగు

**Refrain** : నివర్తిల్లు; ఆవు; తాళు; మానుకొను

**Terminate** : కడతెగు; ముగియు; అంతమగు; అంతముచేయు

*Antonyms* వ్యతిరేకార్థకములు

**Begin**: ఆరంభించు; ఉపక్రమించు; మొదలిడు

**Commence** : ఆరంభించు; ఉపక్రమించు

**Enter upon** : నమోదుచేయు; ప్రవేశించు; చొచ్చు

**Inaugurate**: స్థాపించు; ప్రారంభముచేయు

**Initiate** : ఉపదేశించు; దీక్షయిచ్చు

**Institute** : స్థాపించు, ఏర్పరచు; నెలకొల్పు

**Originate** : కలుగచేయు; పొడము; ప్రవర్తింపజేయు; పుట్టు; ఆరంభమగు

**Set about**: ఆరంభముచేయు; మొదలుపెట్టు

**Set going** : ప్రారంభించి వదలు

**Set in operation** : మొదలగునట్లుచేయు

**Set on foot** : మొదలుపెట్టు

**Start** : కదలు; బయలుదేరు; ఆరంభించు

## STORM : తుఫాను; గాలివాన; వాత్య; హిమపాతము; ఆగ్రహావేగము; సంక్షోభము; ముట్టడి

*Synonyms* సమానార్థకములు

**Agitation** : వ్యాకులత; తల్లడపాటు; సంక్షోభము; ఆందోళన

**Disturbance** : అల్లరి; ఉపహతి; వ్యథ; వ్యాకులత; అలజడి

**Tempest** : తుఫాను

*Antonyms* వ్యతిరేకార్థకములు

**Calm** : స్తిమితము; ప్రశాంతము

Fair weather : మబ్బులేని వాతావరణము; స్వచ్ఛమైనగాలి
Hush : నిశ్శబ్దము
Peace : శాంతి; నెమ్మది; సంధి
Serenity : ప్రసన్నత; నిర్మలత; మనః ప్రసాదము
Stillness : నిశ్శబ్దత; నెమ్మది; శాంతము
Tranquillity : ప్రశాంతి

**STORY : కథ; చరిత్ర; ఆఖ్యానము; కల్పనము**

*Synonyms* సమానార్థకములు

Account : గణన; ప్రస్తవము; ఘనత; వృత్తాంతము
Anecdote : ఉపకథ; వృత్తాంతము
Legend : పురావృత్తము; ఇతిహాసము; పురాణకథ; గాథ
Myth : కల్పితకథ
Narration : కథనము
Narrative : కథా కథనము; వృత్తాంత వివరణము
Novel : నవల
Recital : కథనము; పఠనము
Record : వ్రాసిపెట్టినది; లిఖితము; లేఖా ప్రమాణము; లిఖితవృత్తాంతము
Relation : వావి; కథనము; సంబంధము
Tale : కథ; కొండెములు
Yarn : కథలుచెప్పుట; కథలుఅల్లుట

*Antonyms* వ్యతిరేకార్థకములు

Annals : ప్రతిసంవత్సర వృత్తాంత చరిత్ర; వృత్తాంతచరిత్ర
Biography : జీవితచరిత్ర
Chronicle : వంశాను చరితము; చరిత్ర
History : చరిత్ర; ఇతిహాసము; కథ
Memoir : సంక్షిప్త జీవితచరిత్ర; చరిత్ర; వృత్తాంతము

**STREAM : ఏరు; వాక; ప్రవాహము; గడ్డ**

*Synonyms* సమానార్థకములు

Brook : సెలయేరు
Canal : కాలువ
Channel : కాలువ; సాధనము
Course : ప్రవాహము
Creek : కయ్య; సముద్రపు పాయ
Current : ప్రవాహము
Drift : కొట్టుకొని పోవునది; చోదితము
Eddy : సుడి; సుడిగుండము
Flood : వెల్లువ; వరద; పూరము
Flow : ప్రవాహము; జాలు; పూరము; ధార
Flume : నీటిధార; ప్రవాహము
Flux : ప్రవాహము; పారుదల
Race : పందెపుపరుగు; గమనము
Rill : చిన్నయేరు; కుల్య; కాలువ; బట్టె
River : ఏరు; నది
Rivulet : చిన్నయేరు
Run : పారుదల; ప్రవాహము
Runlet : చిన్న నీటిప్రవాహము
Runnel : చిన్నయేరు
Streamlet : చిన్నయేరు
Tide : సముద్రపుపోటు; ప్రవాహము
Watercourse : ఏరు; కాలువ మొ. ప్రవాహము

**STRETCH : పరచు; సాగదీయు; చాచు**

*Synonyms :* సమానార్థకములు

Distend: ఉబ్బించు: సాగించు; పెద్దదిచేయు
Elongate : పొడుగుచేయు; సాగదీయు
Exaggerate : అతిశయోక్తులతో చెప్పు; కొంచెమును గొప్పచేసిచెప్పు

**Expand** : విస్తరించు; విస్తరింపజేయు; వికసించు
**Extend** : వ్యాపించు; చాచు; ప్రసరింపజేయు; పొడిగించు; సాగు; విస్తరిల్లు; జేయు
**Lengthen** : పొడిగించు
**Reach** : అందుకొను; చేరు
**Spread** : అలము; వ్యాపించు; పరచు; విస్తరిల్లు; చాచు
**Strain** : బిగలాగు; శ్రమపడు
**Tighten** : బిగించు

*Antonyms* వ్యతిరేకార్థకములు

**Loosen** : వదలుచేయు; విప్పు
**Relax** : సడలించు; తగ్గించు; సుకరము చేయు
**Slacken** : మందగించు; సడలించు

**STUPID : ఊబరియైన; బుద్ధిహీనమైన**

*Synonyms* సమానార్థకములు

**Crass** : మందమతియైన; మూఢమైన
**Dense** : జడమైన; మందబుద్ధియైన
**Dull** : అలసమైన; మందమైన
**Dumb** : నోరులేని; మూగయైన

**STUPOR : జడత; మైకము; మత్తు; మూర్ఛ**

*Synonyms* సమానార్థకములు

**Apathy** : నిశ్చింత; ఉదాసీనత; అక్కర లేమి; నిర్లక్ష్యము
**Asphyxia** : శ్వాసస్తంభనము; నాడీ విరామము
**Coma** : మూర్ఛననిద్ర
**Fainting** : సొమ్మ; నిస్త్రాణ, సొలపు
**Insensibilty** : అచేతనత్వము; తిమురు; కొరడు పారిన స్థితి
**Languor** : గ్లాని; అలపు
**Lassitude** : గ్లాని; అలపు; ఆయాసము; బడలిక; బలహీనత
**Lethargy** : నిదురమత్తు; అలసత్వము; మాంద్యము
**Stupefaction** : మూర్ఛ; సొమ్మ; దిమ్మ; మైకము
**Swoon** : మూర్ఛ; సొమ్మ
**Swooning** : మూర్ఛ పోవుట
**Syncope** : మూర్ఛ
**Torpor** : మందత; జడత్వము
**Unconsciousness** : తెలివిలేమి; విస్మృతి స్థితి

**SUBLIME : గంభీరమైన; ఉత్కృష్టమైన; మహనీయమైన**

*Synonyms* సమానార్థకములు

**Beautiful** : సుందరమైన, చక్కగా ఉన్న
**Exalted** : ఉన్నతమైన; ఘనమైన
**Glorious** : మహిమాన్వితమైన; దివ్యమైన; ఘనమైన
**Gorgeous** : శోభావంతమైన
**Grand** : ఘనమైన; దొడ్డయైన, మహోదారమైన
**Lofty** : ఉన్నతమైన; ఊర్జితమైన; ఉదాత్తమైన; గంభీరమైన
**Magnificent** : మహాఘనమైన; వైభవోపేతమైన; దివ్యమైన
**Majestic** : ఠీవిగల; ప్రాభవముగల; దీప్తిమంతమైన
**Noble** : ఉదారమైన; ఉదీర్ణమైన; ఘనమైన
**Resplendent** : ప్రకాశమానమైన, దేదీప్యమానమైన
**Splendid** : ప్రకాశమానమైన; తెల్లయైన; కాంతిమంతమైన

